


| | | |
|---|---|---|
| గ్రంథము | : | భక్త చింతామణి శతకము<br>కూచిమంచి సోమసుందరకవి ప్రణీతము |
| తాత్పర్యము | : | బ్రహ్మశ్రీ డా॥ తూములూరు శ్రీదక్షిణామూర్తిశాస్త్రి గారు |
| ముద్రణ | : | జయనామ సంవత్సర శ్రీరామనవమి<br>8-4-2014 |
| ప్రతులు | : | 500 |
| వెల | : | అమూల్యం |
| ప్రతులకు | : | **బి. వెంకటశంకరానంద్**<br>డోర్.నెం.5-67-10,<br>5/20, బ్రాడీపేట,<br>గుంటూరు-522002<br>ఫోన్: 9963639658, 9849813141 |
| | | **బి. వెంకటరాజేంద్ర**<br>లక్ష్మీమనోహర గార్డెన్స్<br>ప్లాట్ నెం. 131, కాపుజగ్గయ్యపేట<br>విశాఖపట్టణం - 530 049<br>ఫోన్: 9618872666 |





శ్రీ కూచిమంచి సోమసుందర కవి విరచిత

# భక్త చింతామణి శతకము

సులభ సుందర తాత్పర్య సహితము



ప్రచురణ - వితరణ

**బొడ్డపాటి దుర్గేశ్వర ప్రసాద్**
భాషాప్రవీణ, పి.ఓ.యల్. ఎం.ఏ.

**బొడ్డపాటి రామకృష్ణప్రసాద్**

## అంకితం



చిన్నతనంలో తండ్రిలేనిలోటు తెలియకుండా తల్లి స్థానంలో ఉన్న మాయమ్మ
తల్లీ తండ్రీ రెండూ తానై, రక్షణ - పోషణ - విద్యార్జనలకు
తన శక్తిని ధారపోసి శిల్పి రాతిని పూజార్హమైన
విగ్రహంగా మలచినట్లు - మమ్ములతీర్చిదిద్దిన

త్యాగమయి - అనురాగమయి - అమృతమూర్తి
సార్థక నామధేయురాలు - శ్రీమాతృస్వరూపిణీ మా అమ్మగారు.

**శ్రీమతి బొడ్డపాటి అనసూయమ్మ గారికి**

ప్రేమ - భక్తి పురస్సరంగా - కృతజ్ఞతాభివందనములతో
ఈ శివభక్తి శతకం 'భక్తచింతామణి'ని **'అంకితం'** చేస్తున్నాము.

- ప్రచురణకర్తలు







**శ్రీమతి బొడ్డపాటి అనసూయమ్మ గారి**
**గర్భశుక్తి ముక్తాఫలములగు పుత్ర పుత్రికా రత్నములు**



శ్రీమతి మద్దూరు అన్నపూర్ణాదేవి
వల్లూరుపాలెం - కృష్ణాజిల్లా



శ్రీమతి రాచపూడి రుక్మిణీదేవి
హైదరాబాద్



శ్రీమతి బసవరాజు సీతారాజ్యలక్ష్మి
పెదపులిపాకగ్రామం - కృష్ణాజిల్లా



శ్రీమతి మద్దాలి సత్యవతి (శారద)
దేవరపల్లి - కృష్ణాజిల్లా



బి. దుర్గేశ్వరప్రసాద్
ధర్మపత్ని పద్మకుమారి, గుంటూరు



బి. రామకృష్ణప్రసాద్
ధర్మపత్ని విష్ణుశ్రీలత, విశాఖపట్నం

## ముందుమాట

### నమః సాంబాయ

**నమోస్తు సాంబాయ దిగంబరాయ – నమోస్తు కైలాసగిరీశ్వరాయ ।**
**నమోస్తు నందీశ్వర వాహనాయ – నమోస్తు గౌరీ హృదయేశ్వరాయ॥**

విశ్వేశ్వరుని సంకల్పం ఈ సకలచరాచరసృష్టి. శివానుగ్రహం స్థితికి కారణమయితే, ఆగ్రహం ప్రళయానికి సూచకం. అందుకే శివాజ్ఞ లేనిదే చీమైనా కదలదన్ననానుడి. శివలీలా విభూతిని భావించి అనుభవానందభరితులైనవారు శివభక్తులౌతారు – శివయోగులౌతారు – శివానందులౌతారు. భవబంధ విముక్తులై కైలాసవాసులౌతారు.

పవిత్రమైన బిల్వదళం ఒకసారి ఉపయోగించినదైనా తిరిగి శివ పూజకు అర్హమవుతుంది, రుద్రాక్ష ఎన్ని ముఖాలదైనా పుచ్చినదైనా ధరించడానికి శ్రేష్ఠమైనదే. ఏవిధమైన భస్మాన్ని నుదుట విభూతిగా అలంకరించుకొన్నా పవిత్రమే. శివనామస్మరణతో తీసుకొనే జలం ఎలాంటిదైనా గంగాజలతీర్థంగా సంభావింప బడుతుందని – ఈశ్వరానుగ్రహానికి కారణమవుతుందని తెలిపింది – శాస్త్రం.

శ్లో॥ **అంగికంభువనంయస్య, వాచకంసర్వవాఙ్మయం**
**ఆహార్యం చంద్రతారార్కం, వందేతం సాత్వికం శివం –**

కంటికి కనిపించే ఈ విశ్వరూపం విశ్వేశ్వరుడేనన్న సత్యం అనుభూతితో పెద్దలు నిర్వచించారు.

జీవన గమనంలో ఏ కష్టం – ఏ నష్టం – ఏ దురదృష్టం వెంటాడుతున్నా ఉపశాంతి క్రియలుగా శివప్రతిష్ఠ – శివార్చన – శివారాధన – శివాలయదర్శనం – శివప్రదక్షిణం – శివాభిషేకం మొదలగునవి యధాశక్తిగా ఆచరించడం దుఃఖ తరణోపాయంగా శాస్త్రాలు చెప్పిన అంశం పెద్దలు సూచించారు. బాధల నుంచి బయటపడ్డ వ్యక్తి "అమ్మయ్య" అన్నమాటతో ఆనందం పొంగగా వెలువడిన అంతర్యం అమ్మ + అయ్య – ఈ "అమ్మయ్యే" ఈ సాంబయ్యస్మరణ. కాళిదాసు కూడా **"జగతః పితరౌవందే వందే పార్వతీ పరమేశ్వరౌ"** అన్నాడు. శివశక్తుల కలయికే సాంబశివుడు. ఈశ్వరుడు భక్త చింతామణిగా అనుభూతిపొంది శతకంగా సాహిత్య సమార్చన చేసి యశః కాయుడైన **శ్రీకూచిమంచి సోమసుందర కవివరేణ్యుడు** ధన్యుడు. ఆయన కవిత్వాన్ని అందుకొని ఆనందించిన మనము సుకృతులము.







మనలో పశులక్షణాలను తొలగించి పరమేశ్వరతత్త్వాన్ని ప్రబోధింపదలచి గోదావరీతీర 'పల్వల (పలివెల) పురాధీశ్వరుని' ఆ అగ్రహారవాసి కూచిమంచి సోమసుందర కవివరేణ్యుడు శివా! ఓ భక్త చింతామణీ! సాంబా! నీరూపు (అంబతో కూడియున్నవాడు సాంబునిగా) ఎల్లప్పుడు నా మనస్సులో నిలచియుండుటే "సకల కలి దోష నివారణకు – భవ బంధ నిర్మూలనకు – కైలాస ప్రాప్తికి" కారణమని పల్వలపురాధీశ – విశ్వేశ్వరునికి సమర్పించిన 108 పద్యకుసుమాలమాల. ఈ **"భక్త చింతామణి"** ఈ శతకం లోక ప్రసిద్ధమైనది.

శివాజ్ఞగా ఈసాహితీ బిల్వదళాల పూజా నిర్మాల్యం మన మనోమాలిన్యం తొలగించేదిగా సంభావించి ప్రకటించి శివభక్తుల మనోమందిరాలలో పునః ప్రతిష్ఠ ద్వారా భక్త చింతామణి సాంబశివుని అనుగ్రహం కోరుతూ స్వామికి సమర్పించడమైనది. సర్వం శివార్పణం, శివ సంకల్పమస్తు.

నేడు శతకవాఙ్మయం – పద్యాల పఠనం – సాహిత్యాభిలాష అర్థఅవగాహన ఆసక్తి సన్నగిల్లుతున్న దశలో కొందతైనా కవిభావన తాత్పర్యం ద్వారా గ్రహించి శివభక్తి కుసుమాలలోని మకరందాన్ని ఆస్వాదించి ఆనందానుభవాన్ని పొందగలరన్న అభిలాషతో **బ్రహ్మశ్రీ తూములూరు శ్రీదక్షిణామూర్తిశాస్త్రి** గారి ద్వారా తాత్పర్యం వెలయింపజేసి శివభక్తుల పూజా – మనోమందిరాలలో సుప్రతిష్ఠ చేయాలన్నది నా ఆకాంక్ష. ఈ కాంక్షతో ఈ భక్తి శతకాన్ని ప్రచురించటం జరిగింది. కృతి కర్త శ్రీసోమసుందరకవికి శతకోటి వందన సమర్పణ చేస్తూ సులభ సుందర తాత్పర్యం అందించిన **బ్రహ్మశ్రీ తూములూరు శ్రీదక్షిణామూర్తిశాస్త్రి** గారికి సాభినందనాభివాదములు, ఈ శతక ప్రచురణ హవిర్యజ్ఞంలో సహకరించిన **బ్రహ్మశ్రీ సోమాశి బాలగంగాధరశర్మ** గారికి ధన్యవాదములు తెలుపుకొంటున్నాను. దీనిని పఠించేవారికి 107వ పద్యంలో కవి చెప్పిన రీతి ఇహపర సుఖశాంతులను అందించమని పరమేశ్వరుని పార్థిస్తూ **"యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం శంభో! తవారాధనమ్"**గా భావించమని అర్థిస్తున్నాను.

*సర్వం శివమయ మిదం జగత్.*

*అడిగిన వెంటనే స్వామివారి చరిత్ర ఫొటోలు అందజేసిన*
*శ్రీ వేమన గంగాధరరావు – మేనేజర్ (గ్రూపుటెంపుల్స్*
*– పలివెల దేవాదాయ ధర్మాదాయశాఖ) గారికి కృతజ్ఞతలు...*








## 'భక్తచింతామణి'
## "పలివెల" శ్రీ ఉమాకొప్పులింగేశ్వరస్వామి వైభవం

శివభక్తి తత్పరులారా!

భక్తచింతామణి శతకర్త శ్రీ కూచిమంచి సోమసుందరకవి తాను గోదావరీతీరస్థ "పల్వల" గ్రామవాసిగా తెలిపారు. అదే నేటి 'పలివెల' గ్రామం, తూ॥గో॥ జిల్లా, కొత్తపేట మండలంలో ఉంది. సాంబశివుడు శ్రీ ఉమాకొప్పులింగేశ్వరస్వామిగా ప్రసిద్ధిపొంది, ఏకపీఠంపై పార్వతీ సమేతంగా దర్శనమిస్తున్నారు. ఇది పూర్వం **అగస్త్యేశ్వర క్షేత్రంగా** ప్రసిద్ధి పొందింది. కౌశికీ నదీతీరంలో తపమాచరించుచున్న అగస్త్య మహాముని వింధ్యాచలం కారణంగా తాను హిమవత్పర్వత ప్రాంతానికి వెళ్ళి, పార్వతీపరమేశ్వరుల కళ్యాణం చూడలేదన్న బాధతో పరమేశ్వరుని ప్రార్థింపగా, ఆ ఆదిదంపతులు పసుపు వస్త్రములతో కళ్యాణమూర్తులుగా దర్శనమిచ్చారు. ఆతదుపరి అగస్త్య మహర్షిచే ప్రతిష్ఠింపబడినట్లు [illegible] మహాత్మ్య విశేషాలతో విరాజిల్లు క్షేత్రమై **పలివెలగా** ప్రసిద్ధమైందని ఒక ఐతిహ్యం ప్రచారంలో ఉంది.



అనంతరకాలంలో రాజరిక వ్యవస్థలో ఈ దేవాలయం నిత్య కైంకర్యాలతో సేవింపబడుతూ, భక్తుల అభీష్టముల నెరవేర్చే స్వామిగా మహత్తు ప్రకటింపబడినది. ఆ విశేషము ఏమనగా స్వామివారికి నిత్యార్చనకు నియోగింపబడిన విప్రవరేణ్యుడు భక్తి తత్పరుడైయున్నా వేశ్యాలోలుడైన కారణంగా, పౌరులు కొందరు సంస్థానాధీశులకు పూజారిపై పిర్యాదు చేయగా, ఈతని శిక్షింపనెంచి రాజు "పల్వలపుర" దేవాలయానికి వచ్చిన సందర్భంలో, దేవాలయపూజారి స్వామివారి ప్రసాదంతో స్వామివారి నిర్మాల్య పుష్పమాలను అందజేయగా, ఆ పుష్పమాలికలో పొడవైన కేశము (వెంట్రుక) చూచి పూజారిపై కోపించి అడుగగా "పరమేశ్వరుడికి జటాజూట ముండుటచే" ఈ కేశమున్నదని సమాధానమిచ్చిన పూజారిని పరమశివుని జటాజూటము చూపమనగా, నేడు ప్రభాత విశేష అర్చన పూర్తిచేసి నాగాభరణములు అలంకరింపబడిన కారణంగా రేపటి ప్రాతః కాలంలో దర్శింప వచ్చునని పూజారి చెప్పగా రేపు చూపించకపోయిన మీకు శిరశ్ఛేదన శిక్ష చేయుదునని రాజు వెడలెను. భక్తితత్పరత కల్గిన పూజారి, తాను రాజున కిచ్చిన






పుష్పమాల తన ప్రియురాలగు వేశ్యచే ధరింపబడినదగుట – రాజువచ్చు సమయమునకు పుష్పమాల మరొకటి లభింపని కారణంగా ఆమాలయే రాజునకు సమర్పించినందున, జరిగిన పొరపాటుకు మరణమే శరణని – రాజాజ్ఞవల్ల భీతిచెందినవాడై ఆరాత్రి అంతయు గర్భాలయమందే శివధ్యాన నిష్ఠుడై తన అపరాధం మన్నింప పరిపరివిధముల స్వామిని ప్రార్థించి, నీవు కొప్పు (జటాజూటము) ధరించి నన్ను రక్షింపకున్న నాకెవరు దిక్కు అని కన్నీరుమున్నీరై లింగమునకు తలమోదుకొని మరణింప నిశ్చయించుకొన్న భక్త దయాళుండగు శివుడు లింగోద్భవ కాలమున కొప్పును ధరించి పూజారికి దర్శనమిచ్చెను. పూజారి సంభ్రమాశ్చర్య చకితుడై మరునాడు ఉదయం పరీక్షింప వచ్చిన రాజుకు స్వామికి గల కొప్పును చూపగా ఈకొప్పును కృత్రిమమైనదిగా అనుమానించిన రాజు స్వామి కేశము పెకలింప ఆజ్ఞచేయ, అట్లు పెకిలించిన కేశము రక్తసిక్తమై యుండుట ఈచర్యవల్ల రాజుదృష్టి (లోపించెను). లేకపోవుట జరిగెను. రాజు తన అపరాధం మన్నింపని పరమేశ్వరుని ప్రార్థింప తిరిగి దృష్టిపొందినవాడయ్యెను. నాటినుండి ఈ అగస్త్యేశ్వర స్వామిని **ఉమాకొప్పులింగేశ్వరస్వామిగా** భక్తులు కొలుచుట విశేషము. భక్తజన బాంధవుడై **పల్వలపురం** దివ్యసుందర మందిరంలో నిత్య ధూపదీప నైవేద్యాది విశేషములతోనేకాక శివరాత్రి కార్తీకమాస మొదలగు పర్వదిన సందర్భాలలో అనేకరీతుల ఆరాధింపబడుతూ పూజాదికములు అందుకొంటూ ఆపన్న ప్రపన్న పారిజాతమై **భక్తచింతామణిగా** ప్రసిద్ధి నొందినాడు ఈస్వామి. ఈ శివ శక్తులు వెలిసిన దివ్యక్షేత్రం పలివెల క్షేత్రమై విరాజిల్లుచున్నది.

> **శివశ్శక్త్యాయుక్తో యదిభవతిశక్తః ప్రభవితుం ।**
> **నచేదేవందేవో నఖలు కుశలః స్పందితుమపి ।**
> **అతస్త్వామారాధ్యాం హరిహర విరించాదిభిరపి**
> **ప్రణన్తుం స్తోతుంవా కథమకృత పుణ్యః ప్రభవతి । (సౌందర్యలహరి)**

అందుకే అందరి హృదయాలలో అంబతో కూడిన శివుడు (సాంబుడు) సదా నిలిచి యుండి సదాసంరక్షకుడై, సంతారకుడు కూడా కావాలని ప్రార్థిస్తున్నాను.

**– మీ బొడ్డపాటి దుర్గేశ్వరప్రసాద్**

*మహాదేవ! మహాదేవ! మహాదేవదయానిధే!*
*భవానేవ భవానేవ! భవానేవ గతిర్మమ!*



  

ఓం

శ్రీరామ　　　శుభమస్తు　　　అవిఘ్నమస్తు

## ఓం శివాయ గురవేనమః

శా॥ శ్రీమద్భూమి ధరాధిరాజ తనయా చిత్తాంబుజద్యోమణీ!
వ్యామోహార్ణవ తారణైకతరణీ! బాలేందు చూడామణీ!
ప్రేమాభ్యంచిత కంకణీ కృత ఫణీ! బృందారక గ్రామణీ!
స్వామీ! నామది బాయకుండు శివ! సాంబా! భక్త చింతామణీ! 1

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! భక్తుల కోర్కెలు దీర్చుటలో చింతామణి వంటివాడవు. పార్వతీదేవి యొక్క హృదయ పద్మమును వికసింపజేయుసూర్యుడవు, వ్యామోహసముద్రమును దాటించునావవు, బాలచంద్రుని శిరస్సున తాల్చినవాడవు, ప్రేమతో వాసుకి మొదలగు సర్పములను కంకణములుగా ధరించినవాడవు దేవతలలో శ్రేష్ఠుడవు అయిన ఓ శివ స్వామీ! అంబతోకూడి నామదిలో పాయక నెల్లప్పుడు నివసింపుము, శుభములు ప్రసాదింపుము.

మ॥ నతగీర్వాణ! మురారిబాణ కృతనానాలోక నిర్మాణ! సం
తత [illegible]ప్రమాణ! త్రిజగత్కళ్యాణ! సద్భక్త సం
తతి సంత్రాణ ధురీణ! పుంగవలసత్కంఖాణ! భాస్వన్మహా
పతితోద్ధారకళా ప్రవీణ! శివ! సాంబా! భక్త చింతామణీ॥ 2

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! నమస్కరించునట్టి దేవతలు కలవాడా! నారాయణాస్త్రముతో త్రిపురములను సంహరించినవాడా, అనేకలోకములను నిర్మించినవాడా! వేదాంతమును బోధించు ఉపనిషత్తులన్నింటను ఎల్లప్పుడు ప్రశంసింపబడినవాడా! ముల్లోకములకు, శుభమును కలిగించువాడా! భక్త సమూహములను కాపాడుటలో సామర్థ్యము కలవాడా! వృషభము వాహనముగా కలవాడా! మహాపాతకములు (పాపములు) చేసి పతితులైనవారిని స్మరణ మాత్రముచే ఉద్ధరించు ఓ స్వామీ! అమ్మ వారితో కూడి నా హృదయమున నిత్యనివాసము చేయుము.

శా॥ రాజద్దివ్యధునీతురుంభ! మునిహృద్రాజీవరోలంబ! నా
నాజీవాత్మ భిదావిడంబ! పరమామ్నాయ స్తవాలంబ! నీ
రేజాతాక్షమహోకదంబ! దురితా ద్రిప్రచ్ఛిదాశంబ! వి
భ్రాజద్భక్త జనావలంబ! శివ! సాంబా! భక్త చింతామణీ॥ 3





  

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! ఆకాశగంగను కొప్పున ధరించిన వాడా! మునుల హృదయ పద్మములందలి మధువును ఆస్వాదించు తుమ్మెద వంటివాడా! సకల జీవులందుండు జీవాత్మ స్వరూపుడా! వేదములచే స్తుతింపబడినవాడా! పద్మముల వంటి కన్నులు కలవాడా! నిన్ను స్తుతించు వారియొక్క దురితములనెడి పర్వతములను, మొదలంట త్రుంచివేయువాడా! భక్తజనులకు ఆధారమైనవాడా! అంబతోకూడి నా హృదయమునందెల్లప్పుడు విడువక కొలువుండుము.

మ॥ ఘన వైశ్వానరదృగ్లలాట! విలసద్గంగా జటాజూట! పా
వన రౌప్యాచలకూట! వేదచయ భాస్వద్ఘోట! లోక ప్రజా
వనలీలా ధృతకాలకూట! హతగర్వగ్రస్త దోషాట! శో
భనచంద్రార్ధ కళాకిరీట! శివ! సాంబా! భక్త చింతామణీ॥ 4

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! నుదిటియందు గొప్ప అగ్ని నేత్రము కలవాడా! జటాజూటమునందు ఉత్తుంగ తరంగయైన గంగను ధరించినవాడా! నీ నిత్య నివాసముచే పవిత్రము చేయబడిన వెండికొండ పై గల కైలాస శిఖరము కలవాడా! వేదమంత్రములచే స్తుతింపబడినవాడా! మూడు లోకములను రక్షించుటకు కాలకూట విషమును కంఠమున ధరించినవాడా! గర్వితులైన రాక్షసులను సంహరించినవాడా! అందమైన, అష్టమినాటి అర్ధ చంద్రుని శిరస్సున ధరించినవాడా! అంబతో కూడి విడువక నీవెల్లప్పుడు నాహృదయమున నివసింపుము.

మ॥ నళినీబాంధవ కోటిధామ! రిపుసేనాభీమ! నిష్కామ! ని
ర్మలధామా! హతకామ! విద్వ దభిరామారామ! సుత్రామ గీ
తలసన్నామ! విపద్విరామ! నిజభక్తస్తోమ సుక్షేమ! ప
ల్వల సద్గ్రామ లలామ ధామ! శివ! సాంబా! భక్త చింతామణీ॥ 5

తా॥ ఓ భక్త చింతామణీ! కోటి సూర్యుల కాంతితో వెలుగొందువాడా! శత్రు సేనలకు భయమును కలిగించువాడా! కోరికలను జయించిన వాడా! స్వచ్ఛతకు నిలయమైనవాడా! నీపై దండెత్తిన కాముని (మన్మథుని) దహించిన వాడా! పాండిత్యముచే ప్రకాశించువాడా! పార్వతీపతీ! ఇంద్రునిచే పొగడబడిన శుభనామము కలవాడా! ఆశ్రితుల యొక్క ఆపదలను పోగొట్టువాడా! నీ భక్త




సమూహములకు క్షేమమును గూర్చువాడా! పల్వల(పలివెల)మను పేరుగల గ్రామమున నెలకొన్నవాడా! అంబతోగూడి నా హృదయమున నెప్పుడు విడువక నివసింపుము.

మ॥ విలసద్భద్రతురంగ! రంగదజహద్విజ్ఞానయోగాతి ని
రృలయోగి ప్రియసంగ! సంగరరిపు ప్రాణానిలాహారకృ
ద్బల వద్బాణ భుజంగ! జంగమ పురీదాహ క్రియా చంగ, ప
ల్వల పుర్యంబుజ సంగి భృంగ! శివ! సాంబా! భక్త చింతామణీ॥ 6

తా॥ గొప్పదైన వృషభము వాహనముగా గలవాడా! మహిమాన్వితమైన యోగవిద్యలో ప్రవీణులైన యోగిజనులయందు అనురక్తి కలవాడా! యుద్ధమున శత్రువుల ప్రాణవాయువులే ఆహారముగా గల బలవంతమైన సర్పములవంటి బాణములు కలవాడా! త్రిపురములను దహించినవాడా! పల్వల(పలివెల)మను పేరుతో వ్యవహరించబడు పట్టణమనే పద్మమునందు ఆసక్తితో నుండువాడా! అంబతోగూడి, నా హృదయమునెల్లప్పుడు నివాసము చేసుకొని, విడువక కొలువుండుము.



మ॥ స్వవశోద్యజ్ఞగదండ! దండధరగర్వధ్వాంత మార్తాండ! తాం
డవ లీలాధుతకాండ! కాండచయ దీర్ణ క్రూరవేదండ! జ్ఞే
యవిధా సంవిధఖండ! ఖండశశిచూడాలం క్రియా భోగ! వై
భవ విఖ్యాత! సురప్రకాండ! శివ! సాంబా! భక్త చింతామణీ॥ 7

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! నీచే సృష్టింపబడి, నీవశమందున్న ఈ సమస్త జగత్తుకు అండయై నిలిచినవాడా! (రక్షకుడా!) భక్తుడైన మార్కండేయుని కాపాడు సందర్భమున దండధరుడైన యముని గర్వమను చీకటిని పారద్రోలుటలో సూర్యుడవైనదేవా! తాండవకేళితో నెల్లకాలము వినోదించువాడా! గజాసురుని సంహరించినవాడా! జ్ఞానముచే తెలియదగిన అఖండాద్వైతబ్రహ్మమైనవాడా! కోమలమగు చంద్రరేఖను శిరస్సున అలంకరించుకొన్నవాడా! దేవతలలో గొప్పవాడవై దేవాదిదేవునిగా కీర్తింపబడినవాడా! స్వామీ! అంబతో గూడి నాయెదనెల్లప్పుడు ఎడబాయక కొలువుండుము.

మ॥ అలఘుశ్రీకర సుందరాంగ! కరుణోదారాంచితాపాంగ! ని
స్తుల కారుణ్యయుతాంతరంగ! హిమవత్పుత్రీపరిష్వంగ! మ






త్తలతాంతాశుగ గర్వభంగ! ముని హృత్పంకేజసారంగ! ని
ర్మల గంగా కలితోత్తమాంగ! శివ! సాంబా! భక్త చింతామణీ॥ 8

తా॥ భక్తులకు, చింతామణివై కోర్కెలను దీర్చుచు గొప్ప గొప్ప విభూతులను (సంపదలను) ప్రసాదించు సుందరమైన స్వరూపము గల వాడా! దయతో గూడిన కడగంటి చూపుగలవాడా! సాటిలేనిది, కారణము లేనిది అయిన కరుణతో నిండిన హృదయము గలవాడా! హిమమంతుని కుమార్తె హైమవతిని కౌగలించుకొని వామభాగమున నిలుపుకొనినవాడా! గర్వితుడై నిన్నెదిరించిన పుష్పబాణుడైన మన్మథుని గర్వమును భంగమొనరించినవాడా! మునుల హృదయ పద్మములందు విహరించు తుమ్మెదవంటివాడా! నిర్మల మధుగంగతో శోభిల్లు శిరస్సు గలవాడా! శివస్వామీ! అంబతో గూడి నాయెదనెల్లప్పుడు ఎడబాయక కొలువుండుము.

మ॥ నిలయాభూత బుధాంతరంగ! త్రిజగాన్నిర్మాణ రక్షాదిని
స్తుల కార్యాభినయప్రశస్త విచల ద్రూ్భ భంగ! భక్త ప్రజో
జ్జ్వల చిత్తాంబుజమత్త భృంగ! సముదంచత్కోటి కందర్ప కో
మల రేఖాయుత మంగళాంగ! శివ! సాంబా! భక్త చింతామణీ॥ 9



తా॥ ఓ భక్త చింతామణీ! శివస్వామీ! దేవతల (పండితుల) హృదయములందు నివసించువాడా! మూడు లోకములను సృష్టించి రక్షించుట మొదలగు అనేక కార్యములు, కనుబొమ్మలను కదిలించుటచేతనే సిద్ధింపచేయువాడా! భక్తుల చిత్తములను పద్మములందు విహరించు గండు తుమ్మెదయైనట్టివాడా! కోటి మన్మథులతో సాటి వచ్చు కోమలము, సుందరము అగు మంగళ స్వరూపము గలవాడా! దేవాదిదేవా! అంబతోగూడి నాయెదలో నెల్లప్పుడు విడువక కొలువుండుము.

మ॥ జలజాత ప్రభవాచ్యుతాది సుమనస్సందోహ సంస్తూయ మా
నలసన్మంగళ దివ్యవేష! గిరికన్యాచిత్త సంతోష! యు
జ్జ్వల బాలేందు కళావిభూష! కరుణా సంపోషితాశేష! ని
ర్మల కారుణ్య సుధీవిశేష! శివ! సాంబా! భక్త చింతామణీ॥ 10

తా॥ ఓ భక్త చింతామణీ! శివస్వామీ! బ్రహ్మ, విష్ణువు మొదలగు దేవతాగణములచే సంస్తుతింపబడిన దివ్యమంగళ వేషము ధరించినవాడా! సంతతము । గిరిజాదేవి (పార్వతి) హృదయమును సంతోష పెట్టువాడా! ప్రకాశించు

చంద్ర కళను శిరస్సున అలంకరించుకొన్నవాడా! అవ్యాజమైన కరుణతో లోకములన్నింటిని పోషించువాడా! నిష్కళంకమగు దయా స్వభావము కలవాడా! మహాదేవా! నీవు అంబతో గూడి నాయెదలో పాయకనెల్లప్పుడు కొలువుండుము.

మ॥ కలశీసంభవ గౌతమాత్రి శుకమార్కండేయ భృగ్వాదిమౌ
నిలలామావళి గీయమాన మహిమోన్మీలత్సుధా మాధురీ
లలితాత్మీయ కథా ప్రసంగ! శ్రిత కైలాసాంచలోత్సంగ భూ
వలయా భంగ శితాంగ! లింగ! శివ! సాంబా! భక్త చింతామణీ 11

తా॥ ఓ భక్త చింతామణీ! శివస్వామీ! అగస్త్యుడు, గౌతముడు, అత్రి, శుకుడు, మార్కండేయుడు, భృగువు మొదలగు, ముని శ్రేష్ఠులచే కీర్తింపబడిన మహిమోపేతమగు సుధామాధుర్యముగల స్వీయ కథా ప్రసంగములు కలవాడా! (ఆమునులెల్లప్పుడు, శుభదాయకములగు శివ కథలను చెప్పుకొని సంతోషింతురని తాత్పర్యము) కైలాస పర్వత శిఖరమున కొలువున్నవాడా! విశ్వమంతటా నిండిఉన్నవాడా! స్ఫటికము వంటి తెల్లని స్వరూపము గలవాడా! లింగ స్వరూపుడా! నీవు అంబతోగూడి నాయెడద(బాయక) నెల్లప్పుడు కొలువుండుము.

మ॥ [illegible]! పరతత్త్వ జ్ఞాన దాచార్య లో
కవితా నావన కార్య! దీన జనరక్షా విశ్రుతౌదార్య! వి
ష్ణువిధీంద్రాద్య నివార్య వీర్య! సకలస్తోత్రార్హ చాతుర్య భ
వ్య! విమోక్ష ప్రదకీర్తి ధుర్య! శివ! సాంబా! భక్త చింతామణీ॥ 12

తా॥ ఓ భక్త చింతామణీ! శివస్వామీ! నీ దివ్యమైన కాంతితో కోటి సూర్యులను జయించినవాడా! పరతత్త్వజ్ఞానమును ప్రసాదించు పరమగురు స్వరూపా! లోకములన్నింటిని కాపాడునట్టి బాధ్యతను వహించువాడా! దీన జనులను రక్షించుటయందు గొప్ప ఔదార్యము కలవాడా! బ్రహ్మ, విష్ణువు, ఇంద్రుడు మొదలగు దేవతలు కూడా నివారింపలేని (వీర్యము) పరాక్రమము కలవాడా! వేదాదివాఙ్మయములచేత, స్తుతింపబడు సామర్థ్యము కలవాడా! శ్రేష్ఠమైన మోక్షమును ఇచ్చువాడను గొప్ప కీర్తి కలవాడా! నీవు అంబతోకూడి నాయెడదలో పాయకనివాసముండుము.

మ॥ కలిదోషఘ్న నిజప్రసంగ! త్రిజగత్కందాయమానాంగ! దు
ష్టలుషాద భ్ర తమః పతంగ! బుధ హృత్కాసార చక్రాంగ! ని





శ్చల సుధ్యానపరాయణార్య భవపాశ ప్రచ్ఛిదాచంగ! కే
వల విజ్ఞాన మయాత్మసంగ! శివ! సాంబా! భక్త చింతామణీ॥ 13

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! నిన్ను స్మరించి, భక్తితో సేవించువారికి కలిదోషములను పోగొట్టువాడా! మూడు లోకములకు మూలకందమైనవాడా! దుర్బుద్ధితో నేర్పడుపాపములను చీకటులను పారద్రోలుటలో సూర్యుని వంటివాడా! దేవతల, పండితుల హృదయ సరోవరమున సంచరించు హంస స్వరూపుడా! నిశ్చలబుద్ధితో ధ్యానించు ఘన యోగ సాధకుల భవపాశములను ద్రెంచునేర్పుగల వాడా! కేవల విజ్ఞానముచేతనే తెలియదగిన ఆత్మయోగము కలవాడా! మహేశా! నీవు అంబతోగూడి, నాహృదయమున బాయక కొలువుండుము.

మ॥ కృత నానాజగదింద్రజాల! త్రిజగద్గీతాభిధాజాల! సం
తత భక్తావనలీల! ఘోరభవ సంతాపార్తినిర్మూల! వ
ర్ధిత సత్కీర్తి విశాల! శైలవరపుత్రీలోల! దీనావనా
ప్రతిమోద్యత్కరుణాల[illegible]! శివ! సాంబా! భక్త చింతామణీ॥ 14

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! జగముల నెన్నింటినో, సృష్టిచేయు గారడీ విద్య గలవాడా! ముజ్జగములచే కీర్తింపదగిన గుణ సముదాయము కలవాడా! భక్తులను రక్షించుటలో లీలలను ప్రదర్శించువాడా! భయంకరమైన (చావుపుట్టుకలతో గూడిన) సంసార దుఃఖమును పోగొట్టువాడా! పుణ్యాత్ములకు కీర్తిని మిక్కిలిగా పెంపొందించువాడా! హిమవంతుని కుమార్తె హైమవతి (పార్వతి) యందనురాగము కలవాడా! దీనులైనవారిని కాపాడునట్టి మహితోద్యమముకల కరుణా స్వభావుడా! నీవు అంబతో గూడి నాయెడద నెల్లప్పుడు పాయక కొలువుండుము.

మ॥ పరతత్త్వోప నిషద్విహార! వినమద్భక్తౌఘ మందార! దు
స్తర సంసార భయాపహార! జగదాధారా! గుణోదార! భా
సుర నామామృతసార! నిర్మల పరంజ్యోతిర్మయాకార! స
త్త్వరజోముఖ్యవికారదూర! శివ! సాంబా! భక్త చింతామణీ॥ 15

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! పరతత్త్వమును (బ్రహ్మమును) బోధించు ఉపనిషత్తులను వీధులలో విహరించువాడా! భక్తితో, వినమితులై (తలలువంచి) నమస్కరించువారి కోరికలను దీర్చునెడ, మందార వృక్షము





వంటివాడా! దాటరాని సంసార సముద్రభయమును పోగొట్టి, ముక్తిని ప్రసాదించువాడా! జగములకు ఆధారమైనవాడా! ఉత్తమ గుణములతో నొప్పు ఉదార స్వభావుడా! ప్రకాశించు శివనామామృతమునకు సారభూతమైనవాడా! ఏవికారములేని, పరంజ్యోతి స్వరూపుడా! త్రిగుణములకు (సత్త్వ, రజ, స్తమములు) అతీతుడవైనవాడా! పరమేశ్వరా! నీవు అంబతో గూడి ఎల్లప్పుడు నామదినెడబాయ కుందుము.

మ॥ **నిజమాయాకృత సర్వలోక! వినమన్నిత్యావృతాలోక! వి**
**శ్వజగత్పాలన జాగరూక! దివిషద్వంద్యాంఘ్రి నాళీక! భ**
**క్త జనాస్తోక తమో విమోక! పరిధూతస్వాశ్రి తానేక జ**
**న్మ జరామృత్యుభయైక శోక! శివ! సాంబా! భక్త చింతామణీ॥** 16

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! నీమాయచేత లోకములు సృష్టింపబడినవి. వినయములతో నమస్కరించు, నీ భక్తులను, నీవు ప్రేమతో చూచుచున్నావు. విశ్వమునంతను పరిపాలించుచు, సకల జీవులను జాకరూకతతో రక్షించుచున్నావు. దేవతాగణములు, నీపాదములకు నమస్కరించుచున్నారు. దేవాది దేవా! నిన్ను [illegible] భక్తులు నుతించుచున్నారు. నీవు వారి తమోగుణమును (అజ్ఞానమును) పోగొట్టుచున్నావు. నిన్ను ఆశ్రయించిన భక్తజనులకు, జన్మ, జరా (ముసలితనము) మృత్యుభయములు లేకుండ నీవు రక్షణ చేయుచున్నావు. అట్టి నీవు, నీసతి పార్వతితో గూడి నాహృదయమునఎప్పుడు కొలువుందుము.

మ॥ **పరసంత్రాసకరప్రతాప! శమిత బ్రహ్మాది సంతాప! దు**
**ర్భర మోహాంధ తమః ప్రదీప! విలసద్భర్మాద్రి రాట్చాప! శ్రీ**
**కరసత్కీర్తి కలాప! నిత్యభక్తనిజవ్రాత నిక్షేప! చి**
**త్పరమానంద మయస్వరూప! శివ! సాంబా! భక్త చింతామణీ॥**

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! ధర్మద్వేషులైన దుష్టులను భయపెట్టగల ప్రతాపముగలవాడవు, బ్రహ్మాదుల సంతాపము (దుఃఖము)ను తొలగించువాడవు, దట్టమై భరించుటకు వీలులేని, మోహమను చీకట్లను పారద్రోలుటకు తగిన దీపము వంటివాడవు. మేరు పర్వతమునే ధనస్సుగా ధరించినవాడవు. సత్కీర్తి సంపదలు కలవాడవు, భక్త సముదాయమునకు నిధివంటివాడవు, జ్ఞానానందమయ స్వరూపుడవు అయిన స్వామీ! నీవు అంబతోగూడి నాయెద నెల్లప్పుడు విడువక కొలువుందుము.







మ॥ **నతభక్తవ్రత కల్పభూజ! విలసన్నానా జగద్బీజ! ర**
**క్షిత గీర్వాణసమాజ! పావనతర శ్రీమత్పదాంభోజ! వ**
**ర్ణిత కోటి గ్రహరాజతేజ! కరుణా నిర్వ్యాజ! దీనావన**
**వ్రతపారీణ! సురారిరాజ! శివ! సాంబా! భక్త చింతామణీ॥** 18

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! భక్తితో నీవ్రతమాచరించు వారికి నీవు కోర్కెలను దీర్చు కల్పవృక్షమై ఉన్నావు. కనబడుచున్న ఈ లోకములన్నింటికి మూలము (బీజము) నీవే. నీవు ధర్మాత్ములగు దేవతలను రక్షించుచున్నావు. మిక్కిలి పవిత్రమైన సుసంపన్నమగు పాదపద్మములు కలవాడవు. గ్రహరాజైన సూర్యులు కోటి మందితో సమానమైన తేజముకలవాడవని వేదములు నిన్ను వర్ణించుచున్నవి. ప్రతిఫలాపేక్షలేని కారుణ్యముతో దీనులై ప్రార్థించు రాక్షసులను సహితము రక్షించు నియమము కలవాడవు. (భక్తులను రక్షింతువని వేఱుగా చెప్పనవసరములేదు.) అట్టి నీవు అంబతోగూడి నాయెడదనెల్లప్పుడు బాయక కొలువుండుము.

మ॥ **సవిలాసాగతదక్షయాగ! భవమోక్ష ప్రాభవాభోగ! హై**
**మవతీ సంగత వామ భాగ! సకలామరావనోద్యోగ, సా**
**ధువరానంద కరాత్మయోగ! ధృడచేతోభూ వపుర్దాహసం**
**భవ భస్మోల్లసితాంగరాగ! శివ! సాంబా! భక్త చింతామణీ॥** 19

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! దక్షుడొనరించు యాగమునకు వీరభద్రుడవై విలాసముగ వచ్చినవాడా! పునరావృత్తి రహితమోక్ష పదమును ప్రసాదించు వైభవముగలవాడా! హిమవత్పుత్రియైన హైమావతిని నీఎడమభాగమునిచ్చి అర్ధాంగిగా మన్నించినవాడా! సమస్త దేవతలను కాపాడు ప్రయత్నముకలవాడా! సాధువులైన మునులకు, ఆత్మయోగ వైభవమున ఆనందమునొసంగువాడా! మన్మథుడు, నీకు తపోభంగము చేయుటకు సమ్మోహనాస్త్రము వేయగా, నేత్రాగ్నిచే నాతనిని భస్మము చేసి ఆవిభూతిని, శరీరము నందు పూసుకొన్నవాడా! మహాదేవా! నీవు అంబతోగూడి నాయెదలో నెల్లప్పుడు బాయక కొలువుండుము.

మ॥ **అవనీభృత్తనయా కళత్ర! సమరజ్యాఖండితా మిత్ర! దు**
**ర్భర దుఃఖాం బుధియానపాత్ర! సితభాస్వద్గాత్ర, పంకేజ బాం**

ధవ చంద్రానల నేత్ర! నిర్మల జగత్కల్యాణ చారిత్ర! స
త్ప్రవర స్తోత్ర! జగత్పవిత్ర! శివ! సాంబా! భక్త చింతామణీ॥ 20

**తా॥** ఓ భక్త చింతామణీ! శివస్వామీ! పర్వత రాజకుమార్తెయైన పార్వతిని వివాహమాడినవాడా! యుద్ధమున వింటినారి శబ్దముతోనే శత్రువులను జయించిన వాడా! దుఃఖ సముద్రమును దాటించునావవు అయినవాడా! భస్మము నలదు కొనుటచే తెల్లని శరీరము కలవాడా! సూర్య చంద్ర – అగ్నులే మూడు నేత్రములుగా కలవాడా! పవిత్రమైన, లోక కల్యాణదాయకమైన (చరిత్ర) నడవడి కలవాడా! సత్వగుణప్రధానులైన ముని గణములచే, స్తుతింపబడినవాడా! నీ మహిమచే జగములను పవిత్రమొనరించినవాడా! నీవు అంబతో గూడి, నిత్యము, నాయెడబాయక కొలువుండుము.

మ॥ అమితశ్రీకర సుప్రసాద! నిజభక్తాభీష్ట దాహ్లాద! యా
గమ సంచార వినోద! దీనజనరక్షాసంతతామోద! దు
ష్ట మహాపాపవిభేద, ఘోరభవపాశచ్ఛేద! బ్రహ్మాచ్యుత
ప్రముఖాభ్యర్చిత పాద! శ్రీద! శివ! సాంబా! భక్త చింతామణీ॥ 21

**తా॥** ఓ భక్త చింతామణీ! శివస్వామీ! బోళాశంకరుడవై, అధికమైన సంపదలను ప్రసాదించు దయాస్వభావుడా! ఆత్మార్పణము చేసిన నీ అంతరంగిక భక్తులకు కోరిన కోరికలిచ్చి ఆనందమొసఁగువాడా! వేదశాస్త్రమార్గములందు విహరించు వినోదము కలవాడా! దీనులను రక్షించుటలో (విషభక్షణము మొ॥) ఆనందమునునుభవించువాడా! చెడుపనులు చేయుట వలన కలిగిన మహాపాతకములను (పాపములను) స్మరణ మాత్రముచే నశింపజేయువాడా! భయంకరమైన, భవపాశములను త్రుంచి, రక్షణ చేయువాడా! బ్రహ్మ – అచ్యుతుడు (విష్ణువు) మొదలగు ముఖ్యులచే అర్చింపబడిన పాదములు కలవాడా! ఆశ్రితులకు సంపదలనిచ్చువాడా! నీవు అంబతోగూడి, బాయక ఎల్లప్పుడు నాయెడదలో కొలువుండుము.

మ॥ పదపద్మార్చక కల్పవృక్ష! త్రిజగత్పాపచ్ఛిదా దక్ష! దు
ర్మదదైతేయ విపక్ష! విశ్వలయ నిర్మాణావనాధ్యక్ష! చం
ద్ర దినేంద్ర జ్వలనాక్ష! భక్తనివహోద్యద్భూరి సన్మంగళ
ప్రద! రాజత్కరుణా కటాక్ష! శివ! సాంబా! భక్త చింతామణీ॥ 22





**తా॥** ఓ భక్త చింతామణీ! సాంబశివా! నీపాదకమలసేవకులకు, అభీష్టములిచ్చు కల్ప వృక్షము వంటివాడా! ముల్లోకములవారి తాపములను పోగొట్టుటలో సమర్థమైనవాడా! వరబలగర్వితులై లోక కంటకులైన రాక్షసులకు, శత్రువైనవాడా! విశ్వమును నిర్మించుట, పోషించుట, లయమొనరించుట అను పనులు నిర్వహించు నేర్పుకలవాడా! చంద్ర, సూర్యాగ్నులు నేత్రములుగా కలవాడా! భక్త సంతతులకు పెక్కు శుభములనిచ్చు కరుణాకటాక్షములు కలవాడా! నీవు అంబతోగూడి పాయకనాయెడదలో నెల్లప్పుడు కొలువుండుము.

మ॥ ధవళాంచద్దరహాస! మౌని హృదయాంతర్వాస! నిస్సీమవై
భవ కైలాస నివాస! భూరి నిజసద్భక్తా వనోల్లాస! స
త్ప్రవర స్వాంత వికాస! భాస్వదఖిల బ్రహ్మాండభాండావళీ
భవ రక్షాలయకృద్విలాస! శివ! సాంబా! భక్త చింతామణీ॥ 23

**తా॥** ఓ భక్త చింతామణీ! సాంబశివా! తెల్లని వెన్నెల వంటి నవ్వుగలవాడా! మునుల హృదయములందు నివసించువాడా! సాటిలేని మేటివైభవముకలవాడా! కైలాసమునందు నివసించువాడా! నీ భక్తులను రక్షించుటలో ఉత్సాహము కలవాడా! సత్వగుణముచే విరాజిల్లు హృదయముకలవాడా! ప్రకాశించు ఈ సకల బ్రహ్మాండములను, సృష్టించి, రక్షించి లయమొనరించుట లీలగా గల వాడా! నీవు పాయక అంబతోగూడి, నిత్యము నాయెడదలో కొలువుండుము.

శా॥ మున్నా ఘోర హాలాహలాగ్ని త్రిజగంబు ల్గాల్పనీవంతట
స్వెన్నుండాదిగ వేలుపుల్మొఱలిడ న్వేవచ్చి నీవావిషం
బన్నాఁడావి జగంబు గాచితట, యన్నా యెన్న నీకన్న నా
పన్నత్రాణపరాయణుల్గలరె! సాంబా! భక్త చింతామణీ॥ 24

**తా॥** ఓ భక్త చింతామణీ! సాంబశివా! సముద్రమథనమున ముందుగా బుట్టిన హాలాహలాగ్ని ముల్లోకములను దహించు సందర్భమున బ్రహ్మ విష్ణువు మొదలగు దేవతలు నీకడ జేరి మొఱపెట్టికొనగా. వారి దీనాలాపములు విని, దయార్ద్ర హృదయుడవై, అవిషంబుమ్రింగి కంఠమున నిల్పి, లోకములను రక్షించితివని వేదశాస్త్ర పురాణములు వివరించుచున్నవి. విచారింపగా, ఆపన్న = ఆపదలోనున్నవారిని, త్రాణ = రక్షించుటయందు, పరాయణుల్ = అనురక్తితో గూడిన ఆసక్తికల వారు నీకన్న వేరెవ్వరు లేరు, అట్టి నీవు అంబతోగూడి ఎల్లప్పుడు నన్నెడబాయక నాయెడదలో కొలువుండుము.

శా॥ సారోదార! సుభక్తి బాణుడు నమస్కారంబుగావించి యిం
పారన్ వేడిన వానియింట సకుటుంబా రూఢిగా నుంటి వి
ట్లేరీ భక్త మనోరథంబు లిడువారీ విశ్వమందెంతయు
న్నారం జూచిన నీవకాక శివ! సాంబా! భక్త చింతామణీ॥ 25

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! ధృఢమైన భక్తితో, బాణాసురుడు నీకు నమస్కరించి వేడినంత మాత్రముచేతనే వాని కోరిక మన్నించి, సకుటుంబముగా నీవు వానియింట నుంటివి. కాగడా వేసి చూచినను నీవలె భక్తులకు మనోరథము నీడేర్చువారలీజగమున వేరొకరు కానరారు – (భక్త రక్షణకు ప్రయత్నం చేసిన నీవు, నీలకంఠుడవను బిరుదు వహించావు) – అట్టి నీవు అంబతోగూడి ఎల్లప్పుడు నన్నెడబాయక నా హృదయమున కొలువుండుము.

మ॥ క్షితిలో బల్మఱు బోయకన్నుc డిడు నుచ్చి ష్టోపహారంబు ల
ప్రతిమప్రీతిc బరిగ్రహించి యపవర్గ ప్రాపుగావించితే
పతితోద్ధారకళా నిరూఢబిరుద ప్రఖ్యాతికింజూడ నీ
ప్రతిలే[illegible] శివ! సాంబా! భక్త చింతామణీ॥

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! బోయ కులంలో పుట్టిన "తిన్నడు" (నీ యందు భక్తితో కన్నులిచ్చి, "కన్నప్ప"గా ప్రసిద్దుడయ్యాడు.) పెట్టిన మాంసాహారము మిక్కిలి ప్రేమతో తీసుకొని అతనికి ముక్తిని ప్రసాదించావు. దేవతాగణంలో పతితులను ఉద్ధరించే వాడవను గొప్ప బిరుదు నీకే దక్కింది. అట్టి ఉదారునకు నీకు, ఇతరులెవ్వరు సాటిరారు. అంబతో గూడి నీవు, నాయెడద బాయక ఎల్లప్పుడు కొలువుండుము.

శా॥ రిక్తాచారుcడొకండు పేర్మి శివరాత్రి న్వేశ్యతో గూడి సం
సక్తిం దత్కుచసీమ నీకు నొకపుష్పంబుంచి యర్చించినన్
రక్తిం బ్రోచితి వౌర భక్త సులభ ప్రఖ్యాతి నీయందె సు
వ్యక్తం బైనదిగాని లేదెచట సాంబా! భక్త చింతామణీ॥ 27

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! ఆచారహీనుడొక్కడు, వేశ్యతో గూడియుండి శివరాత్రినాడు లింగోద్భవవేళ ఆమె స్తనమునే నీ శివలింగరూపముగ భావించి భక్తితో నొకపూవు నర్పించినంత మాత్రముననే, అతనిని నీవు ప్రేమతో బ్రోచినావు. "శంకరుడు భక్త సులభుడ"న్న ప్రఖ్యాతి నీయందే వ్యక్తమైనది –





ఇతరులకిట్టిది లేదు. స్వామీ! అంబతోగూడిన నీవు నా యెడదలో నెల్లప్పుడు బాయక కొలువుండుము.

మ॥ అరుదారన్ శివరాత్రి యందొకడు చౌర్యాసక్తియుష్మద్గృ హాం
తర దివ్యస్థలి జాగరూప్తిగనుమాత్రన్ముక్తుడైయేగె ని
న్నిరతాసక్తి భజించు వారికరుదా నిర్వాణలక్ష్మీ విని
ర్భర సంశ్లేష సుఖాబ్ధి తేలుటకు సాంబా! భక్త చింతామణీ॥ 28

తా॥ 'గుణనిధి'యనువాడు, దుర్గుణములతో ఇంటినుండి వెడలగొట్టబడి, ఆకలికి తాళలేక నీ ఆలయములో భక్తులిచ్చిన్నైవేద్యమును అపహరించుటకై శివరాత్రి తెల్లవార్లు నిద్రమానుకొని, గర్భగుడిలోని దీపమును ప్రజ్వలింపజేసి ఆహారమును దొంగిలించుచు పట్టుబడి బలవంతముగ చంపబడినాడు. అట్టివానికి ముక్తి నిచ్చినావు. ఇంక నిత్యము నిన్ను సేవించు వారికి, ఆముక్తికాంతాలింగన సుఖములభించుట అరుదుకాదు – నీ అనుగ్రహముపొందిన వారిజన్మమే ధన్యము. స్వామీ నీవు అంబతోగూడిపాయక నాయెడద నెల్లప్పుడు కొలువుండుము.

మ॥ సుర లాస న్సుర[illegible]
రరయన్ లోకహితార్థ మాగరళ మింతైనం దినం జాల రె
వ్వరు లోకేశ్వర! నీవు దక్కనిcక విశ్వత్రాణ సామర్థ్యమె
వ్వరికైనన్ గలదా త్వదన్యులకు సాంబా! భక్త చింతామణీ॥ 29

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! నీవు లోకహితార్థము హాలాహలమును మ్రింగి, గరళకంఠుడవైతివి. తక్కిన దేవతలందఱు అమృతమును సేవించునప్పుడు గుంపులు గుంపులుగా వచ్చారేకానీ, గరళమును కొద్దిగానైనను దినుటకిష్టపడలేదు. విశ్వమును (త్రాణ) రక్షించు సామర్థ్యము నీకున్నందున నీవు (లోకేశ్వరుడవు) విశ్వేశ్వరుడవని కీర్తింపబడుచున్నావు. అట్టి నీవు అంబతోగూడిపాయక నెల్లప్పుడు నాయెడదలో కొలువుండుము.

శా॥ భక్తింబాయక ఫల్గునుండు భజియింపన్మెచ్చి దేవీసమా
యుక్తి న్నీవు కిరాత వేషమునరానుద్వృత్తి బోరాడి య
వ్యక్తుండై ప్రహరించినంత వరలాభం బిచ్చినావయ్య నీ
భక్తానుగ్రహ మేమి చెప్ప శివ! సాంబా! భక్త చింతామణీ 30

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! అర్జునుడు పాశుపతాస్త్రమునకై నిన్ను గూర్చి తపమాచరించుచుండనీవు నీ భార్యతోకూడి కిరాతవేషమున




పరీక్షింపబోయి, బలిమి నీతోపోరాడు అతని సాహసమును, పరాక్రమమును చూచి, మెచ్చుకొని వరములు ప్రసాదించావు. అమేయమగు నీ భక్తానుగ్రహము, మాటలలో వర్ణించుటకు సాధ్యము కాదు - కొట్టినా, వరములిచ్చు దయా స్వభావుడవగు స్వామీ! నీవు అంబతోగూడి పాయక నాయెడద నెల్లప్పుడు కొలువుండుము - శుభములను ప్రసాదింపుము.

మ॥ గరిమన్నీశరణంబు సొచ్చినను మార్కండేయు రక్షించి దు
ర్భర వైవస్వత భీతిమాన్పి తట నీవాత్సల్యమెన్నంగ నా
తరమా ? నీచరణానతార్థిజన సంత్రాణైక దీక్షావిని
ర్భర భాస్వద్బిరుదంబు నీక తగు సాంబా! భక్త చింతామణీ॥ 31

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! నీ భక్తుడైన మార్కండేయుడు నీశరణువేడినంత మాత్రమున వాత్సల్యముతో యముని బారి నుండి రక్షించివి - శరణాగతులైన వారిని కాపాడుట నీ కొక వ్రతము. ఆ, నీ ఔదార్యము మాటలతో చెప్పనలవికాదు. స్వామీ! నీవు అంబతో గూడి పాయక నాయెడదలో నెల్లప్పుడు కొలువుండుము - శుభములు ప్రసాదింపుము.



మ॥ అలకాధీశునకిచ్చినావు నవసంఖ్యాకాక్షయ శ్రీనిధుల్
జలజాతాక్షున కిచ్చినావు నిజభాస్వద్దివ్య చక్రంబు బెం
పలరన్వజ్రి కొసంగినావతుల దివ్య ప్రాభవం బౌభళీ
బళి నీసాటి వదాన్యుదేడి శివ! సాంబా! భక్త చింతామణీ॥ 32

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! నీవు అలకాధీశుడయిన కుబేరునకు తొమ్మిది విధములైన అక్షయ శ్రీనిధులిచ్చావు, విష్ణుమూర్తికి దివ్య చక్రమును ప్రసాదించావు. ఇంద్రునకు దివ్య వైభవమును చేకూర్చావు - దేవాదిదేవా! వదాన్యులలో అగ్రగణ్యుడవు నీవు. నీకు సాటి వేరొకడు లేడు. స్వామీ నీవు అంబతోగూడి పాయక నాహృదయమునసెల్లప్పుడు కొలువుండుము శుభములను ప్రసాదింపుము.

మ॥ గురుపత్నీ గమనోగ్రపాతక కళంకుండైన చంద్రుండు నీ
శరణన్నంతనె నెత్తిబెట్టు కొని వాత్సల్యంబు సంధిల్లగా
బరి రక్షించితి విట్టియాశ్రిత కృపాపారీణులింకెందు నుం
బరి కింపన్మరిలేరికెవ్వరును సాంబా! భక్త చింతామణీ॥ 33






తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! దేవగురువు బృహస్పతిభార్య తార - చంద్రుడాతని శిష్యుడు. తారా చంద్రుల ప్రణయమును కవులు కావ్యములుగా (తారాశశాంకము) వ్రాశారు. అదియోగపరమైన అర్థమని పెద్దలు చెప్పారు. (చంద్రునిలో మచ్చ ఏర్పడటకు అతని దోషమే కారణమని చెప్పినారు. అట్టి చంద్రుడు, నిన్ను శరణాగతుడై ప్రార్థించిన శిరస్సున అలంకరించుకొని ఆదరించావు. ఓ స్వామీ! భక్తితో శరణుపొందిన చంద్రుని నెత్తిన పెట్టుకొని నీ వాత్సల్యాన్ని ప్రకటించిన ఆశ్రితకృపా పారీణుడవైన నీకు లోకంలో సమానమైనవారు లేరు. మహేశా! నీవు అంబతోగూడి పాయకనాయెడదలో నెల్లప్పుడు కొలువుండుము, శుభములు ప్రసాదింపుము.

శా॥ బాధా మర్షత బ్రహ్మ మూర్ధము ధృణ ప్రాయంబుగా ద్రుంచియు
న్గాఢంబౌ కృప సాలెపుర్వునకు మోక్షంబిచ్చియున్ మించితౌ
రూఢింజెప్పగ నేల తక్కిన సుపర్వుల్ని గ్రహానుగ్రహ
ప్రౌఢినీ్నకు సమాన మెవ్వరిక సాంబా! భక్త చింతామణీ॥ 34

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! తప్పుచేసిన బ్రహ్మను కూడా, శిక్షించావు. (తొలుత బ్రహ్మకున్న 5 ముఖాలలో ఒక ముఖం గడ్డిపోచతో సమానంగా చేసి త్రుంచేశాడు.) భక్తితో కొలిచి, ఆత్మార్పణముగావించిన అల్పజీవి, సాలెపురుగుకు, మోక్షమిచ్చావు. నీ నిగ్రహానుగ్రహ శక్తికిది గొప్ప నిదర్శనము ఈ విషయంలో దేవతలెవ్వరూ నీకు సాటిరారు. అట్టి నీవు నాయెదలో అంబతో సహా కొలువుండుము.

శా॥ లేరే వేలుపు లెందఱేని మిగులన్లెక్కింప వారెవ్వరుం
గారుణ్యంబున భక్తవత్సలత మోక్ష ప్రాభవారూఢి నిం
పారం దావక దివ్య సన్మహిమ లక్షాంశంబునన్ బోలలే
రౌరా మ్రొక్కిన నీకెమ్రొక్కవలె సాంబా! భక్త చింతామణీ॥ 35

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! లోకంలో దేవతల సంఖ్య చెప్తూ 33 కోట్లు అని చెప్పారు. కోటి = సమూహము అనే అర్థం తీసుకొంటే 33 రకాలని కూడా అర్థం వస్తుంది. (సిద్ధులు, సాధ్యులు, చారణులు, యక్షులు, కిన్నరులు, గంధర్వులు మొ॥) ఎంతమంది ఉన్నా తక్కిన దేవతలెవ్వరూ, కారుణ్యమునను, భక్తవత్సలతను, మోక్ష సంపదనిచ్చుటలోనూ, దివ్య మహిమాను

భావమునను నీలో లక్షోవంతుకు సాటిరారు. ఆదిదేవా! నీవు అంబతోగూడి పాయక నాయెడద నెల్లప్పుడు కొలువుండుము. శుభములను ప్రసాదింపుము.

మ॥ గ్రహరాజుంగని నీవు పందులురులంగా గొట్టునవ్వేళ నే
గ్రహచారంబులు జాలకుండె మఱియా బ్రహ్మోత్త మాంగంబుబల్
రహినీచే దెగనేవిధాత నొసటన్ వ్రాసెన్నవద్దివ్య స
న్మహిమ ప్రాభవ మింతెకాక శివ! సాంబా! భక్త చింతామణీ॥ 36

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! ఈశ్వరుడు లేకుండగా చేయు తండ్రిచే దక్షయజ్ఞమున సతీదేవి "పిలువని పేరంటమునకు నీవేల వచ్చితివని" అధిక్షేపింపబడి యోగాగ్నిలో తన తనువు చాలించెను – ఆతర్వాత హిమ గిరి పుత్రిగా పుట్టి, నిన్ను వివాహమాడి 'జగన్మాత' అయ్యెను. దక్షుని యజ్ఞ సందర్భమున వచ్చిన దేవతలందరిలో సూర్యునికి వీరభద్రుడు దంతములు విరుగగొట్టెను, పార్వతి కల్యాణ సందర్భమున పురోహితుడుగా ఉన్న బ్రహ్మతలలో నొకటి శివుడే స్వయముగా త్రుంచివేచెను. గ్రహచారములు, నుదిటవ్రాతలు పరమేశ్వరుని ముందు నిలువజాలవు. ఈశ్వరుని దివ్య మహిమ మొక్కటియే ఈ జగత్కారణ కారణముగా తోచుచున్నది. స్వామీ! మహానుభావా! నీవు అంబతోగూడి పాయక ఎల్లప్పుడు నా హృదయమున కొలువుండుము. శుభములు ప్రసాదింపుము.

శా॥ నీచారిత్ర ముబల్విచిత్రముగదా నీసేవక శ్రేణికిం
పౌచిత్రాంబర రత్న భూషణ సుధా హారాదికం బిచ్చి నీ
వాచర్మాంబర మస్థిమాలయు విషాహారంబు గైకొంటి వా
హా! చాతుర్యము చెప్పగా దరమె సాంబా! భక్త చింతామణీ॥ 37

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! శివ స్వామీ! నీచరిత్రము కడువిచిత్రమైనది. నీసేవక సమూహమునకు ఇంపైన పట్టుబట్టలు వివిధములైన రత్నాభరణములు మొ॥ ఇచ్చి నీవు మాత్రము చర్మాంబరము, పుఱ్ఱెలదండ, విషాహారము తీసుకొని సంతృప్తిపడితివి. నీచాతుర్యము వర్ణింప శక్యమా! నిరాడంబరజీవితము, లోకోపకారబుద్ధి నీ నుండి నేర్చుకొందుము. స్వామీ! నీవు, అంబతోగూడి పాయక నిత్యము నాయెడదలో కొలువుండుము. శుభములను ప్రసాదింపుము – అండగా శివుడుండ శుభములకు కొదువలేదు.





మ॥ అణుమాత్రంబు దలంప వాద్విజవధాద్యత్యంతఘోరాఘముల్
కణమైనం బరికింపబోవుఘన రాగద్వేష లోభాదులన్
గణనం జేయవు జాతి ధర్మ విధిభంగంబుల్ రవంతేనియుం
బ్రణతా భీష్ట వరంబు లిచ్చు తరి సాంబా! భక్త చింతామణీ॥ 38

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! భక్తితో నిన్ను శరణుపొందినవారికి వరములిచ్చునప్పుడు వారు చేయు బ్రహ్మ హత్యాది ఘోరపాపములను గానీ, వారి యందు గల రాగ, ద్వేష, లోభాది దోషములనుగానీ లెక్కింపవు. జాతి, ధర్మ, నియమ భంగములను కూడా తలంపవు. నీకారుణ్యమంతటి విస్తృతమైనది. మహానుభావా! నీవు, అంబతోగూడి పాయక నాయెడద నెల్లప్పుడు కొలువుండుము శుభములను ప్రసాదింపుము.

మ॥ గరిమ న్విప్రు డొకండు చేత శివలింగంబుంచి పూజింప నం
తరుషం దజ్జనకుండుగాంచి పడదన్నన్వాడు క్రోధాప్తి ద
చ్చరణంబు ల్దెగ ద్రుంచి తత్క్షణమయ స్వప్నా కృతింజెందెనీ
పరిచర్యామహిమల్వి చిత్రములు సాంబా! భక్త చింతామణీ॥ 39

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! పూర్వమొక బ్రాహ్మణుడు చేతిలో శివలింగమును ధరించి పూజించుట జూచి ఆతని తండ్రి ద్వేషముతో కుమారుని పెడదన్ని తీవ్రముగా దండించెను. అంత నా కుమారుడు శివాపచారము చేసిన తండ్రిని క్షమింపక క్రోధముతో వాని చరణంబులు ద్రుంచెను. ఆ కుమారుని ధర్మవీరమునకుమెచ్చి నీవతనికి అనిమిష (దేవతా) స్వరూపమును ప్రసాదించితివి. శివుని పరిచర్య చేసినవారికి, శివారాధము చేసినవారిని శిక్షించినవారికి శివుడు మహిమలను కలిగించునని చాటినావు. విచిత్రములైన నీ లీలలను వర్ణించుట సాధ్యముకాదు. కావున, స్వామీ! నీవు అంబతోగూడి పాయక నాయెడద నెల్లప్పుడు కొలువుండుము. శుభములను ప్రసాదింపుము.

మ॥ బలభిన్ముఖ్య మరుత్కిరీటమణి దీపశ్రేణి నీరాజితో
జ్జ్వల పాదాబ్జుడవైన నీకు సరిపోల్పన్ దైవముల్లేరు శ్రీ
వెలయంగన్గాన నీకుసాటి మరినీవేకాని విశ్వంబులో
బలుకుల్ వేయు నికేల చాల శివ! సాంబా! భక్త చింతామణీ॥ 40

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! నీకు నమస్కరించు దేవేంద్రాదులైన

దేవతల, కిరీటములందలి మణిదీపములతో నీరాజనములందుకొను పాదపద్మములు కలవాడా! మహేశా! విశ్వమందు నీతో సరిపోల్పదగిన దైవములు లేరు. విచారింపగా అన్ని విధముల నీకు నీవేసాటి. మాటలు వేయేల (అనన్వయాలంకార శోభ ఇందు దర్శనమిచ్చుచున్నది). స్వామీ! నీవు అంబతోగూడి పాయక నాయెడదనెల్లప్పుడు కొలువుండుము. శుభములను ప్రసాదింపుము.

**శా॥ శ్రీరాముండు కపిస్వరూపదివిషత్సేనా సహాయాది సం**
**భారుండై శతయోజనాయతముగా బంధించి యున్నట్టి యా**
**వారాశిందమినొక్క గ్రుక్క గను ద్రావంగుంభజుండోపుటే**
**పారన్నీపద భక్తి సన్మహిమ సాంబా! భక్త చింతామణీ॥ 41**

**తా॥** ఓ భక్త చింతామణీ! సాంబశివా! శ్రీరాముడు, లంకపై దండైపోవునప్పుడు, దేవతలు కపిరూపులై వారధి నిర్మాణము చేయుటలో సహాయము చేశారు. ఆ శతయోజన విస్తీర్ణమైన లవణసముద్రమును నీభక్తుడైన (కుంభ సంభవుడు) అగస్త్యమహర్షి ఒక్కగ్రుక్కలో (మింగినాడు) త్రావినాడు. నీ అనుగ్రహము పొందిన మహర్షికే అంతటి మహాత్మ్యము కలిగినది. ఇంక గొప్పదైన నీ మహిమ వర్ణించుటకు మాటలుచాలవు. ఓమహాతేజా! నీవు అంబతోగూడి పాయక నాయెడదనెల్లప్పుడు కొలువుండుము శుభములను ప్రసాదింపుము.

**మ॥ తనరన్ సర్వసుపర్వులందు బరతత్త్వంబెవ్వరో సత్య భా**
**వనతో దెల్పుమ టన్న వ్యాసుడు "నదైవం వాసు దేవాత్పరం"**
**బనిచేయెత్తి వచింపనంత నిజబాహాస్తంభనంబైన స**
**ర్వని రూఢిం బరతత్త్వమీ వనదె సాంబా! భక్త చింతామణీ॥ 42**

**తా॥** ఓ భక్త చింతామణీ! సాంబశివా! పూర్వము మహర్షులందరు వ్యాసుని సమీపించి 'దేవతలందఱిలో పరతత్త్వమెవ్వర'ని ప్రశ్నింపగా, నాతడు "న దైవం వాసుదేవాత్పరమ్" (వాసుదేవుని (విష్ణువు) కన్న గొప్ప దైవము వేరొకడు లేడు), అని చేయెత్తి జేకొట్టెను. అప్పుడాతని చేయి కదలికలు లేక స్తంభించి పోయినదట. అంతలో ఆలోచించి శక్తితో కూడిన ఈశ్వరుడే (సాంబశివుడే) పరమోత్తముడని వచించెనట. అంత నతని చేతికి కదలిక వచ్చినదట. (ఈ కథలో శివశక్తుల పారమ్యము నిరూపింపబడినది. నిజమునకు శివకేశవులయందు భేదమేలేదు. ఒకేతత్త్వమును వారి, వారి అభిరుచులను బట్టి ఆయా నామరూపములతో





ఆరాధించి, తరించుట లోక ప్రసిద్ధము – సందర్భము ననుసరించి ఒకరికి ప్రాధాన్యము చెప్పబడుటచే వారి అభిమానము తెలియజేయ బడుచుండును.) ఓ జగదీశ్వరా! ఇందు మూలముగా నీవు మిక్కిలి గొప్పవాడవని నిరూపింపబడినది. అంబతోగూడి నీవునాయెదలో నెల్లప్పుడు కొలువుండుము – శుభములు ప్రసాదింపుము.

**మ॥ పుర సంహార! మఖాపహార! నలినోద్భూతోత్త మాంగచ్ఛి దా!**
**స్మర దాహాంతకనాశ! మృత్యుజయ! భీమక్ష్వేళపానాది దు**
**ష్కర కృత్యంబులు నీవొనర్చు కతనన్ సర్వేశ్వరుండంచునిన్**
**బరమామ్నాయము లెంతయుంబొగడు సాంబా! భక్త చింతామణీ॥ 43**

**తా॥** ఓ భక్త చింతామణీ! సాంబశివా! నీవు, త్రిపురములను త్రిపురాసురులను సంహరించి, దక్షుని యజ్ఞమును భంగపరచి, బ్రహ్మశిరస్సు ఖండించి, మదనుని నీ మూడవ కంటి మంటతో కాల్చి, మృత్యువును పారద్రోలి, అంతకాసురుని నాశనముచేసి, భయంకరమైన కాలకూట విషము ద్రావి, నందువలన (లోకంలో [illegible] చేసిన [illegible] నిన్ను సర్వేశ్వరుడని వేదములన్నియు కీర్తించుచున్నవి. స్వామీ! జగద్రక్షకా! నీవు అంబతో గూడి నాయెడదనెల్లప్పుడు పాయక కొలువుండుము శుభములను ప్రసాదింపుము.

**మ॥ తలదావంచు కొనెన్ఫణీంద్రుడతిచింతన్వాగ్వరారోహ వె**
**ల్వెల బాతెన్; విధియేమి తోపకయె నిర్విణ్ణాత్ముడై నల్దెసల్**
**గలయం గన్గొనుచుండె గీష్పతియు శంకన్మౌఢ్యముంబూ నె ని**
**న్వల నొప్పు న్వినుతింపజాలమిని సాంబా! భక్త చింతామణీ॥ 44**

**తా॥** ఓ భక్త చింతామణీ! సాంబశివా! నీ దివ్యచారిత్రమును, మహామహిమమును వర్ణింపలేక, వేయితలలున్న శేషుడు చింతతో తలవంచుకొనెను, వాగ్దేవి, సరస్వతి వెలవెలబాతెను, చతుర్ముఖ బ్రహ్మ, తన కేమియుతోచక నిర్విణ్ణుడై నల్దెసలను మార్చి మార్చి చూచుచుండెను. దేవగురువు బృహస్పతియు తన అజ్ఞానము బయటపెట్టుకొనవలసివచ్చునని ఏమియు తెలియనివానివలె ఊరక కూర్చుండెను. ఇంక మాబోటి వారికెట్లు సాధ్యమగును ? ఓ పార్వతీపతీ! నీవు అంబతోగూడి పాయక నాయెడదనెల్లప్పుడు కొలువుండుము, శుభములను ప్రసాదింపుము.

మ॥ అలవిత్తేశుఁడు మిత్రుఁడై, విమల రౌప్యాహార్య మావాసమై
బలుమేల్బంగరుకొండ మేటి ధనువై భాసిల్లు, నా సర్వ మం
గళ భార్యామణియైన నిన్ గొలుచు భాగ్యం బబ్బునే యీ జగ
ద్వలయంబందును నెంతవారికిని సాంబా! భక్త చింతామణీ॥ 45

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! నీకు ధనాధిపతి కుబేరుడు స్నేహితుడు. పవిత్రమైన వెండికొండ నివాసస్థానము, బంగారు కొండ (మేరు పర్వతము) ధనువుగానుండ, సర్వమంగళ పార్వతి భార్యకాగా, విలసిల్లు నిన్ను గొలుచు భాగ్యం బెందఱికి లభించును ? అట్టి అదృష్టవంతులకెందును కొఱతలే ఉండవు. 'శివుడు' అంటేనే మంగళములను చేకూర్చువాడు అని అర్థము. శివస్వామీ! నీవు అంబతోగూడి, నాయెడద బాయక నెల్లప్పుడు కొలువుండుము. శుభములను ప్రసాదింపుము.

శా॥ కళ్యాణాత్మకమైన చాప, మురుభోగ శ్రేష్ఠమౌనారి సా
కల్యానూనరమా నివాస మగుసత్కాండంబు భద్రప్రదా
మూల్యంబై తగువాహనంబుగల నిన్బూజించిన న్భాగ్య సా
ఫల్యం బొటయదే ప్రపన్నులకు సాంబా! భక్త చింతామణీ॥ 46

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! నీకు, శుభప్రదమైన 'మేరువు' ధనస్సు. దానికి శేషుడునారి. (అల్లెత్రాడు) సకల సంపదలకు నిలయమైన లక్ష్మీపతి (నారాయణుడు) బాణము. యోగక్షేమములను సమకూర్చు వృషభమే వాహనము ఇట్టి నిన్ను, శరణుజొచ్చిన భక్తులకు సకల సౌభాగ్యములు సిద్ధించుటలో ఆశ్చర్యమేమున్నది ? స్వామీ! నీవు అంబతోగూడి, నాయెడద బాయక కొలువుండుము. శుభములను ప్రసాదింపుము.

శా॥ సత్యజ్ఞాన సుఖస్వరూపమగునీ శశ్వన్మహత్త్వంబుదా
నత్యంతాద్భుతమై పవిత్రకరమై యజ్ఞాన విధ్వంసియై
నిత్యశ్రీకరమై చెలంగు నిదిగో నిక్కంబు సర్వశ్రుతుల్
ప్రత్యక్షంబుగ జాటుచుండు శివ! సాంబా! భక్త చింతామణీ॥ 47

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! సత్యము, జ్ఞానము ఆనందము (సుఖము) అయిన 'బ్రహ్మము' నీ స్వరూపము. నీ మాహాత్మ్యము పవిత్రమయి, మిక్కిలి ఆశ్చర్యమును కలిగించును. నిన్ను స్మరించువారి అజ్ఞానమును పోగొట్టును,





నిత్యము నిరుపమానమగు సంపదలను సమకూర్చునని, సమస్తవేదములు ఎలుగెత్తి చాటుచున్నవి. ప్రత్యక్షముగ ఇవి అన్నియు సాధకులకు, అనుభవమున తెలియుచున్నవి. శివమహాదేవా! నీవు అంబతోగూడి పాయక నాయెడద నెల్లప్పుడు కొలువుండుము. శుభములను ప్రసాదింపుము.

మ॥ వెలయన్ సర్వ సుపర్వరూపమగు నీవిశ్వస్వరూపంబు కే
వల రూఢి న్సృజియింప లేక బహుదైవ భ్రాంతి బెక్కుండ్రు మూ
ర్తుల సేవింపగ వారికిం దదుచితోద్యోగాను రూపం బుగా
ఫలదానం బిడుమేటి వీవకద; సాంబా! భక్త చింతామణీ॥ 48

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! ప్రపంచమున గోచరించునవి అన్నియు నీరూపములే. నీవు విశ్వరూపుడవు. ఈరహస్యమును తెలుసుకొని నిన్ను భజింపలేక, భ్రాంతితో కొందరు బహునామరూపములతోనున్న పెక్కండ్రు దైవములను వేరువేరుగా సేవింతురు. దయాంతరంగుడవైన నీవు వారియజ్ఞానమును మన్నించి, వారి ప్రయత్నమునకు తగినట్లు ఆయా, రూపములతోనే ఫలములనిచ్చి కాపాడుచున్నావు. విశ్వేశ్వరా! నీవు అంబతోగూడి పాయక నాయెడద నెల్లప్పుడు కొలువుండుము. శుభములను ప్రసాదింపుము.



మ॥ అరయన్భూ జల వహ్నివాయు ఖ రవీంద్వాత్మాష్ట కంబెన నీ
పరమూర్త్యష్టకమై యొసంగ, నిఖిల బ్రహ్మాండ భాండోత్కరం
బు, రహిందజ్జలబుద్బు దోపమములై పుట్టున్మ నుంగిట్టు నీ
పరమానందమయ స్వరూపమున సాంబా! భక్త చింతామణీ॥ 49

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి (పంచభూతములు) సూర్యుడు, చంద్రుడు, యజమాని అనునవి ఈశ్వరుని అష్టమూర్తులు, దృశ్యమానమగు (కనబడునట్టి) ఈ విశ్వము నందన్నియు నీటిబుడగలవలె (బుద్బుదములు) పుట్టుచు, మరణించుచు నీపరమానందమయ స్వరూపమున కలిసిపోవుచున్నవి. భగవంతుడా! నీవు, అంబతోగూడి పాయక నాయెడద నెల్లప్పుడు కొలువుండుము. శుభములను ప్రసాదింపుము.

మ॥ లీలానిర్మితనైకకోటి ఘననాళీ కోద్భవాండ చ్ఛటా
మాలా జాల విరాట్స్వరూపమగు నీ మాహాత్మ్య మింతైన నా
నాళీ కాక్ష చతుర్ముఖాద్యమరులెన్నం జాల రెన్నాళ్ళ కుం
బ్రాలేయాచల కన్యకారమణ! సాంబా! భక్త చింతామణీ॥ 50

**తా॥** ఓ భక్త చింతామణీ! సాంబశివా! నీవు, లీలగా అనేక బ్రహ్మాండములను సృష్టింతువు. విరాట్స్వరూపుడవగు నీ మాహాత్మ్యమును విష్ణువుతోకూడి, బ్రహ్మాదులైన దేవతలందఱు సమగ్రముగ వర్ణింపజాలరు. నీవు అనంతుడవు. ఓ పార్వతీపతీ! నీవు అంబతోగూడి, పాయక నాయెడద నెల్లప్పుడు కొలువుండుము. శుభములను ప్రసాదింపుము.

**మ॥ తనియన్మేటి మనోరథార్థముల బొందన్వొచ్చు, నుద్య ద్వీప**
**ద్వనధుల్దాటగవచ్చు, నశ్రమతవిశ్వం బెల్ల దెల్లంబుగా**
**గనగావచ్చు సకృజ్జపంబుననెవీకన్ శైవపంచాక్షరీ**
**మనురాజం బఖిలార్థసాధనము సాంబా! భక్త చింతామణీ॥ 51**

**తా॥** ఓ భక్త చింతామణీ! సాంబశివా! శివపంచాక్షరీ మంత్రజపము వలన కోరికలు సిద్ధించును, తృప్తి కలుగును. కష్ట సముద్రమును అవలీలగా దాటవచ్చును. దివ్య దృష్టితో విశ్వమెల్ల స్పష్టముగా చూడవచ్చును. వేయెల మంత్రరాజమైన శివ పంచాక్షరి మంత్రము (నమశ్శివాయ) తజ్జప పరాయణులకు సకలార్థ సాధకమై విరాజిల్లును. నీవు అంబతో గూడి పాయక నాయెద నెల్లప్పుడు కొలువుండుము. శుభములను ప్రసాదింపుము.



**శా॥ చేతోవీధి భవత్పదాంబుజము దాజింతించి యెందేగినన్**
**భూత ప్రేత పిశాచ రాక్షసగణంబుల్ పోవు దవ్వై, యసం**
**ఖ్యాతా పన్నిచయంబడంగు, నిరపాయాత్యంత సన్మంగళ**
**వ్రాతంబుల్ సమకూడు, నిక్కమిది సాంబా! భక్త చింతామణీ॥ 52**

**తా॥** ఓ భక్త చింతామణీ! సాంబశివా! హృదయమున నీపదములను భక్తితో తలచుకొని సంచరించువానికి భూత, ప్రేత, పిశాచ రాక్షసగణములు దూరముగా జరిగిపోవును. లెక్కలేనన్ని ఆపదలు చుట్టుముట్టినను, తమంత తాముగా విడివడును. అపాయములేని శుభపరంపరలెన్నో సమకూరును. ఇది సత్యము, అనుభవసిద్ధము. నీవు అంబతో గూడి పాయక నాయెద నెల్లప్పుడు కొలువుండుము. శుభములను ప్రసాదింపుము.

**మ॥ నుదుటన్భస్మమలంకరించి యఖుతన్ రుద్రాక్షముల్దాల్చి, లీ**
**ల దలిర్పన్భవదీయ దివ్యచరితల్ గానంబు గావించుచు,**
**న్ముద మొప్ప న్విహరించు వాని గని తా మోహాతి రేకంబుచే**
**వదలం జాలదు ముక్తికాంత; శివ సాంబా! భక్త చింతామణీ॥ 53**





**తా॥** ఓ భక్త చింతామణీ! సాంబశివా! నుదుట భస్మము ధరించి, మెడలో రుద్రాక్షమాలను దాల్చి నీదివ్య చారిత్రమును కీర్తన చేయుచు విహరించు నీభక్తులకు సంతోషము కలుగును. శివస్వరూపుడైన అతనిని చూచి ముక్తికాంత మోహముతో దరిచేరును. నీవు అంబతో గూడి పాయక నాయెద నెల్లప్పుడు కొలువుండుము. శుభములను ప్రసాదింపుము.

**శా॥ నీలీలా చరితావళుల్వొగడు వానిం జూచి భీతాత్ములై**
**జాలింబొందుచు గాలకింకరులు తత్సామీప్యమందుండకే**
**చాలంగా బరువెత్తి పోదురట మించన్ దవ్వుగా; నోజగ**
**త్పాలారాధిత పాదపద్మ! శివ! సాంబా! భక్త చింతామణీ॥ 54**

**తా॥** ఓ భక్త చింతామణీ! సాంబశివా! జగత్పాలకులైన రాజులచే, దిక్పాలకులైన దేవతలచే పూజింపబడు పాదపద్మములు కల ఓ సాంబశివా! నీలీలా విశేషములలో కూడిన గాథలను పొగడువానిని చూచి, యమభటులు నిస్సహాయులై వాని సమీపమునకు చేరలేక దూరముగా బరువెత్తిపోదురు. కావున ఎల్లరకు సకలభయ హారకమైన శివనామస్మరణము కర్తవ్యము. నీవు అంబతో గూడి పాయక నాయెద నెల్లప్పుడు కొలువుండుము. శుభములను ప్రసాదింపుము.



**శా॥ నీదాక్షిణ్యము, నీకృపాతిశయము, న్నీభక్త వాత్సల్యము**
**న్నీదీనార్థి జనైక పోషణము, నీనిర్వాణసంధాన మిం**
**కే దైవంబులయందు గానమిక వేయేలా గణింపంగ నీ**
**పాదాబ్జంబుల గొల్చి ముక్తుడగు సాంబా! భక్త చింతామణీ॥ 55**

**తా॥** ఓ భక్త చింతామణీ! సాంబశివా! స్వామీ! నీ సామర్థ్యము, దయాస్వభావము, భక్తవాత్సల్యము, దీనులై అర్థించువారిని పోషించుపద్ధతి, మోక్షమునిచ్చు సౌజన్యము మొ॥ సద్గుణములు ఇతర దైవములందు కనుగొనము. వేయేల; నీపాదములను భజించువారు ముక్తులగుదురు. నీవు అంబతో గూడి పాయక నాయెద నెల్లప్పుడు కొలువుండుము. శుభములను ప్రసాదింపుము.

**శా॥ నీకర్పించిన పత్ర పుష్ప ఫల పానీయంబులుద్యన్మ దా**
**స్తో కేభేంద్ర మనోజవాశ్వ విలసత్పూర్ణేందు బింబాననా**
**ద్యాకారంబుల బుట్టి పూర్వభవ విద్యాయుక్తి బ్రాక్పూజక**
**ప్రాకారంబుల బాయకుండునట సాంబా! భక్త చింతామణీ॥ 56**

**తా॥** ఓ భక్త చింతామణీ! సాంబశివా! స్వామీ! భక్తితో నీకు సమర్పించిన పత్ర, పుష్ప, ఫలములు నీరు మొ॥నవి ఏనుగులు, గుఱ్ఱములు, సుందరాంగులగు స్త్రీలు, పదవులు, సంపదలుగా మారి యజమానుల విడువక సేవించుచుండును. చేసినదానికంటే అధికముగా నిచ్చు నీసేవలు మరవకుండుట మా కర్తవ్యము. నీవు అంబతో గూడి పాయక నాయెద నెల్లప్పుడు కొలువుండుము. శుభములను ప్రసాదింపుము.

**మ॥ పరుసంబౌ పులితోలుపైనిడి చితాభస్మంబుమై బూసి య**
**బ్బురమౌ పున్క సరుల్ధరించి జగముల్పుట్టించుచుం ద్రుంచుచుం**
**బరమాయాకలితేంద్రజాల మరుదొప్పంజేయగా గాటికా**
**పరివై యుండితివే బళీ భళిర సాంబా! భక్త చింతామణీ॥** 57

**తా॥** ఓ భక్త చింతామణీ! సాంబశివా! సృష్టి, స్థితి, లయ కారకుడవైన నీవు నిరాడంబర జీవనము గడుపుచుందువు. పరుషమైన పులితోలు కట్టి, చితాభస్మమును శరీరమునందు తాల్చి మెడలో పునుక (పుఱ్ఱె) మాలలు ధరించి భిక్షాటనము చేయుచు, కాటిలో కాపురముండు స్వామీ! నీ మాయతోకూడిన ఇంద్రజాలము ప్రపంచమునకు ఆశ్చర్యమును కలిగించును. నన్ను కరుణింపుము. నీవు అంబతో గూడి పాయక నాయెద నెల్లప్పుడు కొలువుండుము. శుభములను ప్రసాదింపుము.

**మ॥ ధరణీ న్రాజశిఖామణింగొలిచి వేదండాశ్వరత్నాంగనా**
**స్థిర భాగ్యంబుల గాంచునందు రదియెంతేవింతగాదా దిగం**
**బరునా, యాదిమభిక్షుని, న్గొలిచి శశ్వత్ప్రాభవ ప్రోల్ల స**
**త్పరమైశ్వర్యము గాంచుచుండ శివ! సాంబా! భక్త చింతామణీ॥** 58

**తా॥** ఓ భక్త చింతామణీ! సాంబశివా! విరూపుడవైనను, విశ్వరూపుడవై ప్రకాశించు శివస్వామీ, లోకములో కొందఱు వింతగా, రాజులను ఆశ్రయించి అశాశ్వతమైన గజ, అశ్వ రత్నాదులను స్త్రీలను కోరుకొందురేగాని, దిగంబరుడవు, ఆదిభిక్షువు అయినను అఖిలైశ్వర్యములు యిచ్చు నిన్ను ఆశ్రయించుటలేదు. అది వారి అజ్ఞానమునకు నిదర్శనము. నీవు అంబతో గూడి పాయక నాయెద నెల్లప్పుడు కొలువుండుము. శుభములను ప్రసాదింపుము.





**మ॥ వివిధామ్నాయ పురాణ శాస్త్ర మనుసద్విద్యా రహస్యంబులన్**
**హవనాది క్రియలన్ ప్రయాగముఖ దివ్యక్షేత్ర రాజంబుల**
**న్వివరింపన్ సకల ప్రపంచమును నీవేకాని విశ్వంబులో**
**భవదన్యం బిసుమంతలేదుగద సాంబా! భక్త చింతామణీ॥** 59

**తా॥** ఓ భక్త చింతామణీ! సాంబశివా! దేవా! లోకములోగల వేద, శాస్త్ర, పురాణ, మంత్ర విద్యా రహస్యములు, యజ్ఞ, యాగాది క్రతువులు కర్మలు, కాశీ, ప్రయాగ మొ॥ పుణ్యతీర్థ క్షేత్రములు, తక్కిన సకల ప్రపంచమును నీవే. నీవు కానిదీ విశ్వమున, ఇసుమంతైనను లేదు. ఇదియే పరమార్థము. నీవు అంబతో గూడి పాయక నాయెద నెల్లప్పుడు కొలువుండుము. శుభములను ప్రసాదింపుము.

**మ॥ జలజాతాక్ష చతుర్ముఖ త్రిదశ భాషా శేష వాచస్పతుల్**
**పలుకన్నేరరు నీప్రభావలవమున్ భావింప లేరట్టిచో**
**నిలనేనెంతటివాడ! నీదుమహిమంబెన్నంగ నోలింగ! భ**
**వ్య లసద్భూరి దయాంతరంగ! శివ! సాంబా! భక్త చింతామణీ॥** 60

**తా॥** ఓ భక్త చింతామణీ! సాంబశివా! విష్ణువు, బ్రహ్మ, ఇంద్రాదులైన దేవతలు, సరస్వతి, బృహస్పతి మొదలగు వారు నీ ప్రభావమును [illegible] చెప్పలేరు. మనసుతోనూ భావింపలేరు. ఇంక నీ మహిమను వర్ణించుటకు భువిలో జన్మించిన నేనెంతవాడను. సర్వమును నీలో లీనమొనర్చుకొను ఓలింగస్వరూపా! శివా! దివ్యము భవ్యమునగు నీదయాంతరంగమున మదిలో నిలిపిమమ్ము రక్షింపుము.

**మ॥ ఫల పర్ణాంబు సుమంబులిచ్చిన ననల్పశ్రీత్రిలోకీ సము**
**జ్జ్వల సామ్రాజ్య మొసంగి నీవు తుదమోక్షంబిచ్చుచుండంగ నీ**
**సులభోపాయ మెఱుంగలేక మనుజుల్ క్షోభింతురే మొక్కొ యు**
**త్ప లినీబంధు కళావతంస! శివ! సాంబా! భక్త చింతామణీ॥** 61

**తా॥** ఓ భక్త చింతామణీ! సాంబశివా! స్వామీ! చంద్రశేఖరా! పూవులు, ఆకులు, ఫలములు ఇచ్చినంతమాత్రముచేతనే నీవు ఆ భక్తికి సంతోషించి అధిక సంపదలను, త్రైలోక్యసామ్రాజ్యమును ఇచ్చి తుదకు మోక్షము గూడ వారికి ప్రసాదింతువు. ఇట్టి సులభోపాయమును తెలుసుకొనలేక మానవులు ఇతర సుఖాపేక్షతో దుఃఖించుచున్నారు. అది వారి అవివేకమునకు గుర్తు. నీవు అంబతో గూడి నామదిలో నిరంతరము కొలువుండుము.





మ॥ చెనకన్వచ్చి మనోజుడంతటనె భస్మీభూతుడైపోయె నీ
సున దక్షుండు నిరాకరించి చటులా స్తోకార్తిపాలయ్యె, గా
ననికెవ్వండు శివాపరాధ మణువై నంజేసి చేటొందకే
మనగా నేర్చు జగంబులోన శివ! సాంబా! భక్త చింతామణీ॥ 62

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! ఓ సర్వేశ్వరా! మన్మథుడు నీకు తపోభంగమొనరించి, తక్షణమె భస్మీభూతుడైనాడు. దక్షప్రజాపతి ఈర్ష్యతో నిన్ను కాదని నిందించి పరమ దుఃఖమనుభవించెను. ఏవిధముగానూ శివాపరాధ మొనరించువాడు కష్టములు (వినాశము) తప్పక పొందును. అని లోకమునకు నేర్పిన శివా! అంబతోగూడి నామదిలో నిలచియుండుము.

మ॥ క్షితి నానావిధమర్త్యకోటి దమవాసిం బ్రోవ గా బూనిదై
వతముఖ్యుల్లగు పాళ్ళులెట్టి కొనిరిబ్బంగినిన్ యతు విష్ణు పా
ల్మతు కర్తల్ శతమన్యుపాలు, శ్రుతి ధర్మజ్ఞుల్ చతుర్వక్త్రు పా
ల్పతి తానీకము నీదుపాలు శివ! సాంబా! భక్త చింతామణీ॥ 63



తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! ఓ జగద్రక్షకా! శివా! ఈ లోకంలో మానవులు తమతమ స్థాయికి తగిన దేవతలను కొల్చి ఆపదలను తొలగించుకొను ప్రయత్నం చేస్తారు. అందులో భాగంగా యతీశ్వరులు నారాయణుని, యజ్ఞయాగాదులు ఆచరించువారు ఇంద్రుని, వేదధర్మములుపాటించువారు చతుర్ముఖ బ్రహ్మను, పతితులు నిన్ను ఆశ్రయించి అనుగ్రహములను పొందుచున్నారు. ఆయాదేవతలు, మానవులు ఆచరించు సత్ కర్మలకు ఫలములను ఇచ్చుచున్నారేకాని, నీవలె పతితులను పావనులుగాజేసి ఉద్ధరించుటలేదు. అది నీయందున్న దయావిశేషము.

మ॥ అలఘూదారత బూనునాయెడను, నీకర్పించితిన్ మేను, నీ
చులయాచింపగలేను, నీవెగతియంచున్నమ్మి యున్నాను దీ
నులతో బంతముమాను నీకిపుడు నన్బ్రోవ న్వశంబౌను న
న్వలదన్న న్నిను మానబోను శివ! సాంబా! భక్త చింతామణీ॥ 64

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! ఓ శివస్వామీ! నాశరీరము నీసేవకై అర్పించితిని. నీచులను యాచింపలేను. నీవేగతియని నమ్మియున్నాను. నాయెడ, నీ ఘనమగు ఔదార్యమును ప్రదర్శింపుము. దీనుడనైన నాతో పంతము నీకేల ?









దయార్ద్ర హృదయుడవై లోకములను రక్షించు నీకు, నన్ను బ్రోచుట కష్టముకాదు. ఒక వేళ పూర్వజన్మకర్మఫలముగా నాకాభాగ్యము లేకపోయినను నేను నిన్ను భజించుట మానను. నీవు నా మనస్సులో అంబతో సదా నిలువుము.

శా॥ ఏదైవంబుల వంక జూడనిఁక, నేనెట్లైన నిన్వీడ నీ
వేదిక్కంచిటులున్నవాడ, బలుకుల్వేయేల నీవాడ నీ
వాదేలా ననుగన్నవాడ యెపుడు న్బల్మాఋ నాతోడ నీ
పాదంబుల్నెరనమ్మినాడ శివ! సాంబా! భక్త చింతామణీ॥ 65

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! భక్తవత్సలా! శివా! నిన్ను వీడక ఇతరదేవతల వంకచూడక, నీవేదిక్కని నమ్మియున్నాను. నీవాడనైన నాతో నీకు పలుమాఋలు వాదేల ? నన్ను గన్న నా తండ్రి! నీపాదములనే ఆశ్రయించితిని నన్ను కాపాడుము. నీవు అంబతో కలిసి నా హృదిలో నిలిచియుండుము.

శా॥ ప్రారబ్దంబను బల్నెపంబొకటి నాపై వేసి, యాపై మహా
దారాపత్యధనాది పాశముల చేతం గట్టి, దుర్వారసం
సారాబ్ధింబడద్రోసి, నీవటు తటస్థప్రౌఢితో నుండి య
య్యారే! చిత్రము చూచుచౌర శివ! సాంబా! భక్త చింతామణీ॥ 66

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! స్వామీ! ప్రారబ్దమను నెపమొకటి నాపై వేసి ఆపైన భార్య, బిడ్డలు, ధనము మొ॥లగు పాశములతో బంధించి, దాటరానియీ సంసార సముద్రమున బడతోసి నీవు పెద్దరికముతో తటస్థుడవై యుండి, చిత్రము చూచుచుంటివయ్యారే! ఏమి విచిత్రము. నీవు నా మదియందు అంబతో కలిసి సదా నివసింపుము.

మ॥ చెలిమిన్ గుబ్బలిరాచకూతురఅమై జెన్నొప్పలే నవ్వు వె
న్నెల నిగ్గు ల్దిశలెల్ల గప్పు జెలువౌనీ రూపు బాగొప్ప నా
కలలో నైనను జూపుమప్పయడు గంగా రానిదే తప్ప న
న్నలతం బెట్టిననేమి గొప్ప శివ! సాంబా! భక్త చింతామణీ॥ 67

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! అర్ధనారీశ్వరా! శివా! పురాణ దంపతులైన ఉమామహేశులు మీరు మీ అన్యోన్య ప్రేమతో ప్రపంచమునకు ఆదర్శప్రాయులైనారు. సంతోషముతో చిరునవ్వు వెన్నెలలు ప్రకాశింపగా నొప్పు మీ సుందర రూపము అనుగ్రహబుద్ధితో నాకు కలలో నైనను చూపుము. నేను




ధన్యుడనయ్యెదను. అడుగరానిదేమియు నేనడుగలేదు కదా! నన్ను బాధపెట్టుట నీకేమి గొప్పదనము. నీవు అంబతో గూడి సదా నామదిలో నిలచి యుండుము.

**మ॥ శివ నామం బొకసారె భక్తి విభవశ్రీమీఱగా బల్కిన**
**న్వివిధాపన్నిచయంబడంగుఁ దతదుర్విఘ్నౌఘముల్గుంగు ను**
**త్సవముల్పెక్కు చెలంగు నిత్యపరతత్వ శ్రేయ ముప్పొంగు ద**
**ద్భవ బంధంబులు ద్రుంగు నిక్కమిది సాంబా! భక్త చింతామణీ॥ 68**

**తా॥** ఓ భక్త చింతామణీ! సాంబశివా! నీ శివనామము భక్తితో తలచువారికి వివిధములైన ఆపదలు తొలగిపోవును. ఎట్టి విఘ్నములును దరిచేరవు. శుభపరంపరలు వర్ధిల్లును. పరతత్త్వానుభవ శ్రేయము కలుగును. భవబంధములు వదలిపోవును. కావున శివా! నీ నామస్మరణము చేయుభాగ్యము నొసంగుము. నీవు నామదిలో అంబతో కూడి కొలువుండుము.

**మ॥ సవనవ్రాతమొనర్పనేల పశుహింసల్ సేయగా నేల! యో**
**గ విధానంబులు పూననేల తనువింకం జేయగా నేల తా**
**వివిధాభీష్టము లొందవచ్చు సుఖియై విశ్వేశ! సద్భక్తితో**
**భవదంఘ్రిస్మరణంబు జేసి శివ! సాంబా! భక్త చింతామణీ॥ 69**

**తా॥** ఓ భక్త చింతామణీ! సాంబశివా! విశ్వేశ్వరా! నీ పాదపద్మములను భక్తితో స్మరించు వారికి సకలాభీష్టములు సిద్ధించును. సుఖములభించును. అట్టి పరమ భక్తులు, యజ్ఞయాగాది క్రతువులొనర్చి పశుహింస చేయ నవసరము లేదు. కష్టసాధ్యమగు అష్టాంగయోగమభ్యసింపబనిలేదు. ఉపవాసాది నియమములతో శరీరము కృశింపజేయ నక్కరలేదు.

**మ॥ ఖల సాంగత్యముగాదు చేసినను దుఃఖం బీకనేపోదు, పె**
**ద్దల సాంగత్యము మానరాదు, మత భేదంబుల్ వృథావాదు, ని**
**శ్చల సారంబగు నీదు భక్తి పరమోక్షప్రాప్తికింబాదు మో**
**హలతల్ ద్రుంపక ముక్తి లేదు శివ! సాంబా! భక్త చింతామణీ॥ 70**

**తా॥** ఓ భక్త చింతామణీ! సాంబశివా! లోకములో దుష్టులతో స్నేహము చేయరాదు. అది దురభ్యాసములకు నిలయమై తుదకు దుఃఖహేతువగును. మంచివారితో స్నేహము మానరాదు. సన్మార్గమున పయనించుటకది కారణమగును. నామ రూపములు కల్పితములు కావున దైవము యెడ






(శివకేశవాది) భేదభావములో వాదులాడుకొనుట వృథా ప్రయాస నిశ్చలమైన నీదుపద భక్తి యొక్కటియే మోక్షప్రాప్తికి పాదు (మూలము) భౌతిక సంపదలందు వ్యక్తుల సంబంధములందు మోహము విడువక ముక్తి ఏర్పడదు. అన్నింటి యందును నాకు మోహవిచ్ఛేదము చేయుము.

**మ॥ పరులన్బాధ లొనర్చి, బల్ధనము సంపాదించి విఖ్యాతికై**
**ధరలోజేసిన యట్టి ధర్మములు వ్యర్థంబై చనుంగాక, సు**
**స్థిరతం బొందునె! సర్వభూత పరితృప్తింజేయుటే నీ మహా**
**పరిచర్యాకరణంబుగాదె శివ! సాంబా! భక్త చింతామణీ॥ 71**

**తా॥** ఓ భక్త చింతామణీ! సాంబశివా! ఈశ్వరా! ఇతరులను బాధించి, సంపాదించిన ధనముతో పేరు ప్రతిష్ఠలకొఱకై దాన, ధర్మములు చేయరాదు. అట్లు చేసిన పనులు వ్యర్థములైపోవునే కాని, శాశ్వతములై సత్ఫలితము నీయజాలవు సర్వభూతదయతో జీవులను పరితృప్తులను చేయుటయే మహేశ్వరసేవ. ఈ సూక్ష్మమును గ్రహించి ప్రవర్తించుటమేలు.

**మ॥ క్షితిలో గొందఱు వారివారి మతముల్ శ్రేష్ఠము లన్యంబులౌ**
**మతముల్గావని చెప్పుచుందురది నీ మాయావృత భ్రాంతి సం**
**తత నానావిధ జంతుసంతతి హృదంతర్యామివౌ నీకు స**
**మ్మతి గానట్టి మతంబునుంగలదె సాంబా! భక్త చింతామణీ॥ 72**

**తా॥** ఓ భక్త చింతామణీ! సాంబశివా! త్రిలోకేశ్వరా! భువిలో కొందఱు వారి వారి మతములే శ్రేష్ఠములైనవి. తక్కినవి కావని వాదించుచుందురు. ఇది నీమాయచే ఏర్పడిన భ్రాంతియేకాని, అన్యముకాదు. సమస్త ప్రాణి హృదయాంతరములందుండు నీకు సమ్మతికాని మతమేలేదు. (మతము అంటే అభిప్రాయమని అర్థం) అందరికి ఆధారభూతమైనవాడు పరమేశ్వరుడు. ఈ భేద దృష్టి అజ్ఞాన జనితమని నా (కవి) అభిప్రాయము.

**మ॥ అరయన్నీవ పరోక్షతన్నిఖిల భూతాత్మ స్వరూపుండవై**
**పరిపూర్ణ స్థితినుండగన్గొనక నిన్భావింతు రెందో జనుల్**
**పరమేశా! భవదీయమాయ దెలియంబద్మోద్భవాదిత్య గో**
**పరమేశాదులకైన బోలదట సాంబా! భక్త చింతామణీ॥ 73**

**తా॥** ఓ భక్త చింతామణీ! సాంబశివా! స్వామీ! శివా! నీవు సకల

భూతములందు పరిపూర్ణుడవై, ఆత్మస్వరూపుడవై, ప్రత్యక్షముగ గోచరించుచుండ, అట్టి నిన్ను చూడలేక ఎక్కడో కొండకోనలలో రాయి, రప్పలలో భావించుచు వెతుకుచుందురు. అదియే నీమాయ. బ్రహ్మ, విష్ణు, దివాకరాదులకు (సూర్యుడు) నీమాయ తెలియశక్యముకాదు. తక్కినవారి సంగతి వేరుగా చెప్పవలెనా?

**మ॥ విపరీతార్థ కుతర్క వాదములచే విజ్ఞాన మొప్పారునే ?**
**కపటాచార విడంబన క్రియలచే గైవల్యమేతెంచునే ?**
**చపలాశా విషయోపభోగములచేఁ జల్లారునే తృష్ణ ? నీ**
**యపరోక్షాను భవంబు లేక శివ! సాంబా! భక్త చింతామణీ॥ 74**

**తా॥** ఓ భక్త చింతామణీ! సాంబశివా! పరమేశ్వరా! అనుభవైక వేద్యమగు ఆత్మవిద్యచే మాత్రమే నిన్ను తెలియదగి ఉన్నది. కుతర్క, వాదములచే కపటాచార పద్ధతులచే చంచలమగు ఇంద్రియ సుఖములచే తత్త్వమెఱుకపడదు. అన్నీ నీవను ("సర్వం ఖల్విదంబ్రహ్మ") జ్ఞానము వలన మాత్రమే కైవల్యము సిద్ధించును.

**మ॥ కలివేళన్ విధి చోదితక్రియ లొగింగావింపగా లేక తా**
**ల[illegible]తత్త్వవేదులము మేమంచున్ సుకర్మంబు లి**
**మ్ముల గావింపరుగాని, భోగ్యవిషయంబుల్మానగాలేరు ని**
**ష్ఫల దంభోక్తుల ముక్తి చేకుఱునె సాంబా! భక్త చింతామణీ॥ 75**

**తా॥** ఓ భక్త చింతామణీ! సాంబశివా! పరమేశ్వరా! ఈకలికాలమున అలసులై కొందఱు వేదవిహిత ధర్మకర్మములాచరింపక మేము తత్త్వవేత్తలమని విఱ్ఱవీగుచు సుఖాపేక్షతో విషయాసక్తులగుచున్నారు. అబద్ధపుమాటలతో ముక్తి సిద్ధింపదుగదా!

**మ॥ నరులన్మో సముపుచ్చి సొమ్ముఁగొౕన నానాశాస్త్ర వాదంబులు**
**న్వరవేదాంత విశిష్ఠ యుక్తులును దంభప్రాప్త వేషంబులుం**
**గరమొప్పారునుగాని సద్గురు కటాక్షం బింత లేకున్న నీ**
**పరతత్త్వం బెఱుంగంగ రాదు గద సాంబా! భక్త చింతామణీ॥ 76**

**తా॥** ఓ భక్త చింతామణీ! సాంబశివా! మహేశ్వరా! సద్గురువులను ఆశ్రయించి నీపరతత్త్వము తెలుసుకొనదగియున్నది. కేవల శాస్త్రవాదములు వివిధ వేషధారణములు అనుభవరహితములైన వేదాంతవాక్యములు నరులను మోసగించి, సొమ్ము పుచ్చుకొనుటకు మాత్రమే ఉపయోగపడునుగాని జ్ఞానహేతువులు కావు.





**శా॥ మీనం బెప్పుడు నీటనేమునుగు, నా మేషంబు పర్ణాశనం**
**బే నిత్యం బొనరించుఁ బాము పవనంబేగ్రోలు నేప్రొద్దు న**
**ద్దాన స్నానికి నేమి పుణ్యఫల మొందంగల్గె ? నట్లౌను నీ**
**ధ్యానం బించుకలేని సత్క్రియలు సాంబా! భక్త చింతామణీ॥ 77**

**తా॥** ఓ భక్త చింతామణీ! సాంబశివా! నదుల స్నానముచేయుచు, ఆకులలములు భుజించుచు వాయువును మాత్రమే భక్షిం కొందఱు భక్తులమని తమను చాటుకొందుఱు. నీధ్యానమును మరచువారికి కేవల కర్మలవలన ఏమి ప్రయోజనము ? చేప నీటిలో మునిగియుండుట, మేక ఆకులనే భక్షించుట పాముగాలినే పీల్చుట, గమనించుచున్నాము. దానిచే వానికి కలిగిన పుణ్యఫలమేమి ? సంతతము నిన్ను చింతించువారే ధన్యులు, సుకృతులు.

**శా॥ దేవా! తావకభక్తిలేని నరుడే తీర్థంబులం గ్రుంకినన్**
**గ్రావాగ్రంబులపై వసించినను యోగ శ్రేణి సాధించినన్**
**గైవల్యార్హుడు గాడతండితర కాంక్షల్మాని నిన్నాత్మలో**
**భావింపంగలవాడు ముక్తుడగు; సాంబా! భక్త చింతామణీ॥ 78**

**తా॥** ఓ భక్త చింతామణీ! సాంబశివా! కోరికలు మదిలో పరుగులెత్తగా నీయందు భక్తి లేని నరులు ఏ తీర్థములందు మునిగినను, కొండ కోనలలో నివసించినను యోగమభ్యసించినను, కైవల్యమును (మార్గము) పొందనేరరు. కాంక్షలను విడిచి నిరతము నిన్ను ఆత్మలో దలచువారికే ముక్తి లభించునుగదా!

**మ॥ తనవారొక్కరు గూడరారు, యమబాధ ల్మాన్పగా లేరు మున్**
**ధనకాంక్షం దనుగూడినారు తుద జెంతన్నిల్ప గాబోరు గా**
**వున వైరాగ్యము మీఱు ధీరులతి భవ్యుల్ వారు నీ భక్తి భా**
**వనచే ముక్తికి జేరువారు శివ! సాంబా! భక్త చింతామణీ॥ 79**

**తా॥** ఓ భక్త చింతామణీ! సాంబశివా! బ్రతికినన్నాళ్ళు ధనకాంక్షతో చుట్టూ తిరిగిన తన వారందఱు తుదకు దగ్గరకు కూడారారు. మరణానంతరము వెంటరారు. యముడు శిక్షించు బాధలను మాన్పలేరు. ఈ సంగతి గుర్తించి వైరాగ్యము నవలభించిన వారు ధన్యులు. వారు నీభక్తి భావనచే ముక్తికి చేరుదురు.

**మ॥ ధరణిం గోరకయున్న బోవు సుఖముల్, తాగోరినన్రావు, గా**
**పురముల్నిత్యముగావు సంతప్రజగుంపుంబోకలేపోవు నీ**

శరణన్న న్విడనాడలే విదియె మోక్ష ప్రాప్తికిందావు ద
బ్భఱవేసంబులు మెచ్చవీవు శివ! సాంబా! భక్త చింతామణీ॥ 80

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! దేవా! సుఖములు కోరినంతమాత్రం చేతరావు. కోరనివారికి దూరముకావు. కాపురములు నిత్యముకావు జీవులు సంతలో గుంపువలె వచ్చిపోవుచుండుట సహజము. డాంబిక వేషములు మెచ్చని నీవు, శరణన్నవారిని విడనాడలేవు ఇదియే మోక్షప్రాప్తికి మార్గము.

మ॥ తిరమై దేహము నిల్చునా ? శమనుడిందే నిల్వఁగా నోర్చునా ?
సిరిదానిల్కడ సేయునా ? యెపుడు వాసిన్వెన్నెల ల్గాయునా ?
ధర సంసారము నిత్యమా ? తెలివినొందన్లేక మున్నెప్పుడో
పరమార్థంబొనరింతు నేననిన; సాంబా! భక్త చింతామణీ॥ 81

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! దేహేంద్రియమనోబుద్ధులు వశము తప్పనపుడే, తెలివితో నిన్ను ఆశ్రయించి పరమార్థమును (ముక్తిని) పొందవలెనేగాని, మఱెప్పుడో ధర్మము ఆచరింతుననుట అజ్ఞానము అగును. పాంచభౌతికమైన ఈదేహము స్థిరముగాదు. ఇచటనే ఉండుటకు యముడు అంగీకరింపడు. పున్నమినాటి వెన్నెల అమావాస్యకు ఉండదు. సిరిసంపదలు శాశ్వతములుకావు. సంసారము నిత్యముకాదు. ఇపుడే ఈశరీరముతోనే పునరావృత్తి రహితమగు నిత్యకైలాస వాసమునకై యత్నింపవలెను.

మ॥ చెదురున్ దృష్టి, మనీషయుం జెదరు బల్జీర్ణంబులై యంగము
ల్వదలున్, దంతములెంతయుంగదలు, శీలంబంతమున్నేచను
న్మదిమి జిక్కినవేళఁ జిత్రమిదియేమో తృష్ణ దానొక్కదే
వదలంజాలదుగాని మానవుని సాంబా! భక్త చింతామణీ॥ 82

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! ఉమాపతీ! నరునకు నాలుగు దశలు. అందులో ముసలితనము మిక్కిలి కష్టములను కలిగించును. కన్నులు కానరావు. బుద్ధి మందగించును. అవయవములు పనిచేయవు. దంతములు పడిపోవును. శీలము నశించును. మఱి ఇంకెన్ని పోయినను కోరికలు (తృష్ణ), మాత్రముపోవు. కావున మానవులు 'దీపముండగనే ఇల్లుచక్కబెట్టుకొన్నట్లు నీయందు భక్తికలిగి, ముందుగా నీ అనుగ్రహమునకై యత్నింపవలెను.







శా॥ జ్ఞాతిద్రోహులు, బంధుఘాతకులు హింసా సత్యశూన్యుల్ దయా
వీతస్వాంతులు సాధుబాధకులు నై వేధించుచున్నాడు ని
ర్భీతిందాగలి పూరుషుండిపుడు ధాత్రి, న్నీవుపేక్షించిన
న్మాతండ్రీ! బ్రదుకెట్లు సాధులకు సాంబా! భక్త చింతామణీ॥ 83

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! ఈకలిలో ధర్మము నశించిపోయినది. జ్ఞాతి ద్రోహులు, బంధుఘాతకులు, హింసాస్వభావులు సత్యశూన్యులు, దయారహితులు మితిమీరిపోయినారు. కలిపురుషుడు భయములేనివాడై పెక్కు విధముల విజృంభించినాడు. మా తండ్రీ! సాంబా! చూచి నీవును ఉపేక్షించిన సాధుజనులకు జీవనమెట్లు సాధ్యమగును. కృపామతివై కాపాడుము.

మ॥ ధనమేసాధన మెల్ల కార్యములకుం దర్కింప, సత్కీర్తి జీ
వనమే పావనమెల్ల లోకములకు న్వర్ణింప, నీపాదపూ
జనమే భాజనమెల్ల భద్ర ములకుం జర్చింపగా నేరికి
న్మనమేకా ఘనమోక్షకారణము సాంబా! భక్త చింతామణీ॥ 84

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! ధనమే సకలకార్యములకు సాధనము. లోకములో సత్కీర్తితో సాగిన జీవనము పావనము. నీపాదపూజనమే శుభములకు హేతుభూతము. ఎంతటివారికి మనస్సే మోక్షకారణము. కావున, నామనస్సు నీయందే లగ్నమగునట్లు అనుగ్రహింపుము.

మ॥ ధర సత్కీర్తికి దానమే, మిగుల సద్యస్తృప్తికిం బోనమే
సరసత్వాప్తికిగానమే కలహనాశస్ఫూర్తికి న్మౌనమే
గరిమావాప్తికి మానమే నిరత మోక్షప్రాప్తికిన్ జ్ఞానమే
పరగుంగా కిఁకగానఁమేక్రియల సాంబా! భక్త చింతామణీ॥ 85

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! లోకంలో దానము సత్కీర్తిని, అన్నము తృప్తిని, గానము సరసత్వమును, మౌనము కలహనాశనమును, అభిమానము గౌరవమును, జ్ఞానము మార్గమును కలిగించును. ఇతర క్రియలెవ్వియు అందు కుపకరింపవు. భక్తుల బ్రోచుటలో నీకుసాటి మఱియెవ్వరును లేరు.

మ॥ నినుమెచ్చించుట భక్తినే జనులకు న్మేలౌట సత్యోక్తినే
తనకు న్బంధము రక్తినే పరమ భద్ర స్ఫూర్తి సద్యుక్తినే

కన నిశ్చింత విరక్తినే సకల దుఃఖప్రాప్తి సంసక్తినే
మనముం బట్టుట యుక్తినే యగును సాంబా! భక్త చింతామణీ॥ 86

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! భక్తిచేతనే నీదు మెప్పు లభించును. సత్యవాక్యము చేతనే జనులకు మేలు చేకూరును. అనురక్తి చేతనే బంధమేర్పడును. మంచిమాటవలననే భద్రము చేకూరును. వైరాగ్యము చేతనే అభయము సిద్ధించును. విషయ సంసక్తివలననే దుఃఖములు కలుగును. ఉపాయము (సాధన) చేతనే మనోనిగ్రహము సాధ్యమగును. ఇవి అన్నియు పాటించుట సజ్జన లక్షణము.

శా॥ ఆయుర్దాయము సెల్లిమర్త్యులు సదా యామ్యాలయం బొందుటల్
శ్రేయస్సంపద నొక్కొడన్నరులు నిశ్రేయస్సులై యొక్కెడం
గాయక్లేశము నొందుటల్గనియు, రాగద్వేషముల్మానరీ
మాయాపాటవ మేమిచెప్ప శివ! సాంబా! భక్త చింతామణీ॥ 87

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! విశ్వరూపా! మర్త్యులు (మరణించు స్వభావం కలవారు) మాయకు లోబడి రాగద్వేషములతో బాధపడుచున్నారేకాని అసలు రహస్యమును తెలుసుకొనలేకున్నారు. పుట్టినవారందఱు, ఆయుర్దాయము తీరినంత మరణించి యమపురికి చేరుచున్నారు. ఈ లోకములో కూడా కొందఱు, శ్రేయస్సంపదలతో సుఖించుచున్నారు. మరి కొందఱు కాయకష్టము చేయుచు దారిద్ర్య దుఃఖమును అనుభవించుచున్నారు. ఇట్లు జరుగుటకు ఆయా జీవులు చేసుకొన్న పుణ్య–పాప కర్మములే కారణము అగుట సత్యము. భ్రాంతి తొలగించి జ్ఞానమును ప్రసాదించి నాకు నీ ఆశ్రయము కల్పింపుము.

మ॥ జగతిం జూడ నియోగియై మొదలదా జన్మింపనేరాదు క
ర్మగతింజన్మముగాంచెనేని బ్రదుకన్రా దట్లుజీవించిన
న్వగతో నిర్ధనుండౌట గూడ దటులైనన్వేగ మిల్వాసిగో
ప్యగతిం దాపసియై చరింపదగు సాంబా! భక్త చింతామణీ॥ 88

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! లోకమున "నియోగి" గా పుట్టరాదు. కర్మానుగతిచే పుట్టినను బ్రతుకు సాగించరాదు. జీవనము సాగించినను నిర్ధనుడై దుఃఖములనుభవింపరాదు. అట్టి దుస్థితి ఏర్పడినచో వేగమే ఇల్లు విడిచి తాపసియై రహస్యముగ ఏ కొండకోనలలోనో దుర్గ మారణ్యములలోనో చరింపవలెను. (కవి ఆత్మాభిమానం గలవాడగుటచే, జీవితమున తన చేదు అనుభవములను





ఈశ్వరునకు విన్నవించుకొన్నాడు. (మరెవ్వరికి ఇట్టి కష్టములు (దుఃఖములు) కలుగకుండుగాక! యని ఈశ్వరుని ప్రార్థింతుము.)

మ॥ నినుసేవింపక పొట్ట కూటికి జనుల్నిత్యంబు మూఢాత్ములై
ధనికద్వారములందు గొల్చెదరు తత్కర్మంబునేమందుఁ గా
నన మందుండెడు కొండ చిల్వకు, శిలాంతర్వర్తి యాకప్పకు
న్నన నాహారము దెచ్చి నీవిడవె సాంబా! భక్త చింతామణీ॥ 89

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! స్వామీ! మూఢులై లోకులు, భక్తితో లోకాధీశుడవైన నిన్ను సేవింపక, పొట్టకూటికై ఆశించి, ధనికుల గృహ ద్వారములందు నిలిచి కొలిచెదరు. వారు నీయందు విశ్వాసము లేక చేయుపనియేగాని, నీవు సర్వజీవ రక్షకుడవు, పోషకుడవు. నీవు ఱాతిలోని కప్పకు, అడవిలోని కొండచిలువకు ఆహారమిచ్చి కాపాడుచున్నావు. ఆయువున్నచో అన్నము లభించును. (ఆయురన్నం ప్రయచ్ఛతి).

మ॥ పుడమిం బెక్కువనంబులన్మధు ఫలంబుల్ స్వాదు పానీయము
ల్గడునొప్పారులతావితానములు యోగ్యంబౌగుహావాసముల్
[illegible]
బడియాచింపగ నేల దుర్మదుల; సాంబా! భక్త చింతామణీ॥ 90

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! భువిలో పెక్కువనములందు కమ్మని ఫలములు; తీయని నీరు, అందమైన పొదరిండ్లు, వాసయోగ్యమైన గుహలు ప్రేమాతి శయముతో బ్రోచేవాడవు నీవుండగా, కూటికై దీనతపడి దుర్మదాంధులను యాచింపబోవుటెందులకు ? నిన్ను నమ్ముకొన్నవారికేకొఱతలురావు.

మ॥ ఇరువందం జడలందు గంగగల నీకీభూజల స్థానము
న్నిరతింజాబిలి పువ్వు దాల్చుదొరవౌ, నీకీధరా పుష్పముల్
గురులోకత్రయ దీపకుండవగు నీకుం దీపము ల్మెచ్చుగా
వరయన్ భక్తియొకండుగాని శివ! సాంబా! భక్త చింతామణీ॥ 91

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! స్వామీ! దివ్య గంగాధరుడవైన నీకు స్నానమున్నకై ఇచటి నీరు, చంద్రశేఖరుడవైన నీకు ఇందలిపూలు, లోకత్రయ దీపకుడవైన నీకు నేయి దీపము పెట్టి అర్చించుట నిన్ను మెప్పింపఁజాలవు. కేవలము భక్తి భావమే అందులకు కారణము, ప్రేరణము. మన్నించుము కొండంత దేవునకు కొండంత పత్రి పెట్టగలమా ? అనివిందుము కదా!

మ॥ పరగన్మన్మథ దేహదాహవిలసద్భస్మాంగరాగంబు న
బ్బురమౌ బ్రహ్మకపాల మాలికలు సద్భోగీంద్ర భూషా చయం
బిరవందంధరియించుమేటి వగు నీకీగంధ మాల్యాదులం
బరితోషం బొనరించువాడెవడు ? సాంబా! భక్త చింతామణీ॥ 92

**తా॥** ఓ భక్త చింతామణీ! సాంబశివా! మహాదేవా! కంటిమంటతో మన్మథుని దహించి ఆభస్మము శరీరమున నలముకొని, బ్రహ్మ కపాలమాలికలు మెడలో ధరించి, శేషుని భూషాచయంబుగా చేసికొన్న మేటివి. నిన్ను ఈ గంధమాల్యములచే సంతోషపెట్టగలవాడెవ్వడు ? భక్తి చర్యగా స్వీకరింపుము.

శా॥ శంకాతంకములేక శంకరునకీశత్వామ్య మొందంగలే
రింకే వేల్పులటంచు దివ్యకరిపై హేమధ్వజంబెత్తియా
పంకేజ ప్రభవాండమెల్ల వినిపింపన్ భూరి భేరీమహా
భాంకారంబులు నిండఁజాటెదను సాంబా! భక్త చింతామణీ॥ 93

**తా॥** ఓ భక్త చింతామణీ! సాంబశివా! శంకరా! ఎందఱో దేవతలు. అందులో శంకరుడు దేవశ్రేష్ఠుడు – శ్రేష్ఠుడు. తక్కిన దేవతలందరు ఈ శంకరునితో ఏ కొద్దిపాటి సామ్యమును పొందలేరు. అని నేను దిగ్గజముపై నెక్కి – బంగారు రంగు జండా నెగురవైచి ఈ బ్రహ్మాండమంతయు వినిపింప శంకలేక గొప్ప భేరీభాంకారములతోనిండునట్లుగా చాటింపు జేతును.

మ॥ బలువింతౌ బరువింతయౌ ననక యా బంగారపుంగట్టు చి
ల్వల తేని, స్వలతేని తండ్రి నొక కేలన్విల్గొనంబమ్ముగా
బలిమిం బూనిన మేటి వీవు నను జేపట్టంగ వ్రేగౌనె యో
బలిపుత్రాంగణ పారిజాత శివ! సాంబా! భక్త చింతామణీ॥ 94

**తా॥** ఓ భక్త చింతామణీ! సాంబశివా! ఓ సర్వేశ్వరా! మిక్కిలి వింత గొలుప, ధనువుగా మేరు పర్వతమును, నారిగా శేషుని, అస్త్రముగా నారాయణుని బరువుగా భావింపక బలిమితో నొక్కచేతిలో ధరించి మించిన మేటివి నీవు. అట్టి శక్తిమంతునకు నన్ను చేపట్టుట (అనుగ్రహించుట) ఏమాత్రము బరువుకాదు. బాణాసురుని ఇంటి ప్రాంగణమున పారిజాతమై వెలసిన నీకు భక్తానుగ్రహము కొత్తకాదు.





మ॥ సకలస్థావర జంగమాత్మవని యత్రాంతంబు నిన్వేఁడ నీ
వకటా నాదు మొఱాలకింప విపు డాహా, కేవల స్థాణుమూ
ర్తికినే మ్రొక్కిన చందమయ్యె! శివుడెంతే సుప్రసన్నాత్ముడన్
ప్రకటఖ్యాతికి సంశయంబొదవె సాంబా! భక్త చింతామణీ॥ 95

**తా॥** ఓ భక్త చింతామణీ! సాంబశివా! సర్వాంతర్యామీ! శివా! స్థావర, జంగమ జగదంతరాత్మవని నిన్నెల్లపుడు వేడుకొన ఔరా! నా మొఱలాలకింపవు ఆదరముతో మారుపలుకవు. ఇయ్యెడ నేను కేవల స్థాణుమూర్తికి (రాతికి) మ్రొక్కినవాడ నైతిని. లోకమున శివుడు సుప్రసన్నాత్ముడను ప్రఖ్యాతికి నేడు సంశయ మేర్పడినది.

మ॥ వ్రతనిష్ఠల్, సురభూ సురార్చనలు, దివ్యక్షేత్రయాత్రల్ శ్రుతి
స్మృతి ధర్మంబు లొకింతయేనెఱు గ, మీ శ్రీపాద పద్మంబులే
మతిలో నమ్మితి నేననన్య రతినో మాతండ్రి! శంభూ! సతీ
పతి! నీవేగతి కావవేనిరతి సాంబా! భక్త చింతామణీ॥ 96

**తా॥** ఓ భక్త చింతామణీ! సాంబశివా! ఓ పార్వతీపతీ! శంభూ! నేను వ్రత నియమము లేవియు పాటింపలేదు. దేవతలను, భూదేవులను అర్చించలేదు. దివ్యక్షేత్రయాత్రలు చేయలేదు. వేదములందు, స్మృతులందు చెప్పబడిన ధర్మ, కర్మములేమియు ఆచరింపలేదు. సంపద్యుక్తములైన మీ పాదపద్మములే మతిలో నమ్మితిని అన్యమెఱుగనినాకు, నీవేగతివై ఎల్లపుడు కాపాడుము.

మ॥ తుంగాబ్ధ్యంబు కణంబు లెన్నదగు, భూధూళింగణింపందగు
న్నింగిం జుక్కలు లెక్కవెట్టదగునింతేకాని నా తప్పులె
న్నంగా రావిఁక నీవుగా కొకరు సన్రక్షించువారేరిఁకె
బ్భంగిం బ్రోచెదొ నీవ దిక్కుసుమ సాంబా! భక్త చింతామణీ॥ 97

**తా॥** ఓ భక్త చింతామణీ! సాంబశివా! పైకిలేచిన సముద్రపు టలలలోని నీటి చుక్కలను (తుంపురులను) లెక్కపెట్టవచ్చును. భూపరాగమునందలి రేణువులను లెక్కపెట్ట గణింపవచ్చును. ఆకాశములోని నక్షత్రములను లెక్కింప వచ్చును. కానీ నా తప్పులెన్నగా సాధ్యము కాదు. పతితపావనుడవైన నీవు తప్ప తక్కినవారు ఎవరు రక్షింతురు? స్వామీ! దయతో నన్ను రక్షింపుము. నీవే దిక్కని నిన్నే శరణువేడుచున్నాను.





మ॥ పరగన్ శంభుడు దీనబంధుడని చెప్పన్నమ్మి యాసన్నిరం
తరమున్నే మొఱలిడ్డ బల్కవిదియెన్నన్మో సమో? లేక మున్
ధరనే జేసినదోసమో? కరగదన్నా నీ మనంబింతఁయో
వరకారుణ్య సముద్ర! రుద్ర! శివ! సాంబా! భక్త చింతామణీ॥ 98

తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! ఓ కరుణాసముద్రుడా! పెద్దలు "శంభుడు దీనబంధుడని" చెప్పగా విని నమ్మి ఆశతో నిరంతరము నేను మొఱ పెట్టుచున్నను. నీవు పలుకకున్నావు. ఇది నీవు చేయుమోసమా! నేను చేసిన దోషమా ? ఇసుమంతైనను నీ మనసు కరగకున్నది. దయతో నన్ననుగ్రహింపుము.

మ॥ పరదైవంబవు నీవటంచు మది నీ పాదాబ్జముల్నమ్మి నే
బరదైవంబుల వేడలేదెపుడు, నాపై నీవుపేక్షించినం
బరగంగాననుబ్రోచు వారెవరిఁకన్, భక్తావనాంచద్దయా
పరమూర్తీ! శరణాగతార్తిహర! సాంబా! భక్త చింతామణీ॥ 99

తా॥ శరణాగతార్తిహరా! శివా! పరదైవము నీవేయని తలచి, నీపాదాబ్జములు మదిలో నమ్మి ఇతర దైవముల నెన్నడు వేడలేదు. నీవు నన్ను ఉపేక్షించినచో, ఇంక బ్రోచువారు ఎవ్వరు? భక్తులను రక్షించుటే నీ స్వభావము. నన్ను దయతో కాపాడుము.

శా॥ నీవే తల్లియు, దండ్రియు, న్విభుడు, సన్మిత్రుండు, జుట్టంబులున్
నీవే దాతవు, దైవమున్, గురుడు, నా నిర్వాణ నిక్షేపము
న్నీవే నాదగు తోడునీడ, మఱియు న్నీవే సమస్తంబుగా
భావింతు, న్నవదన్యమే మెఱుఁగ సాంబా! భక్త చింతామణీ॥ 100

తా॥ ఓ భక్తచింతామణీ! సాంబశివా! నాకు నీవే తల్లివి, తండ్రివి, విభుడవు, మంచి మిత్రుడవు, చుట్టమవు నీవే దాతవు దైవమవు, గురుడవు నా ముక్తినిధివి. తుదకు నాతోడు నీడయు నీవే. ఇంక నాసమస్తంబు నీవుగా భావింతును. నీకంటే వేరెవ్వరిని చేరను, కోరను, రక్షింపుము.

మ॥ నీపాలంబడితి, న్నిరంతరమునే నీపాదముల్నమ్మితి,
న్నీపద్యావళి బాడుచుంటినెపుడు, న్నీకంటె నన్నెవరుం
గాపాడం దొరలేఁడటంటి, నిది నిక్కంబింక నీచిత్తమో
పాప గ్రావ విభేద శంబ శివ! సాంబా! భక్త చింతామణీ॥ 101







తా॥ ఓ భక్త చింతామణీ! పాపహరా! సాంబశివా! నేను నీపాలబడితిని నిరతము నీపాదముల నమ్మితిని. ఎల్లపుడు నీపద్యములు పాడుచుంటిని. నీకంటే నన్ను కాపాడగల ప్రభువు లేడంటిని. ఇది నిజము ఇంక నీచిత్తము – నాభాగ్యము.

మ॥ నీవిఖ్యాత చరిత్రముల్వినుచెవుల్, నీపూజకౌ హస్తముల్,
నీవాసంబులకేగు పాదయుగము న్నిన్గాంచు మేల్ చూపు నిన్
గైవారం బొనరించు జిహ్వయును, నీకై మ్రొక్కు మూర్ధంబు, ని
న్భావింపగల బుద్ధి నాకొసఁగు సాంబా! భక్త చింతామణీ॥ 102

తా॥ ఓ సాంబా! భక్త చింతామణీ! ప్రసిద్ధములగు నీ చరిత్రలు వినగల చెవులు, నీపూజ చేయు చేతులు, నీదేవాలయములకేగు పాదములు, నిన్ను చూడగలమేలగు దృష్టి (యోగదృష్టి) నిన్ను కీర్తించు (నామ సంకీర్తనము) నోరు, నీకునమస్కరించు శిరస్సు, నిన్ను భావింపగల బుద్ధి విశేషము నాకు ప్రసాదింపుము.

మ॥ నీ కీర్తి శ్రుతి, నీకథాశ్రవణమున్నీ పాద సంసేవయు
న్నీ కళ్యాణ గుణానువర్ణనము, నీనిత్యానుసంధానము
న్నాకుంబాయక యుండునట్లొసగుమన్నా జన్మజన్మంబుల
న్నాకాధిపస్తుత పాదపద్మ! శివ! సాంబా! భక్త చింతామణీ॥ 103

తా॥ దేవేంద్ర వినుత పాదపద్మా! సాంబశివా! నీకీర్తి వినుట. నీ కథావళులను గానం చేయుట, నీపాదములు సేవించుట నీమంగళకరమైన గుణములను వర్ణించుట, నిన్ను నిరంతరము మదిలో చింతించుట నాకు జన్మజన్మలకు పాయని వరములుగా ప్రసాదింపుమని ప్రార్థించుచున్నాను.

మ॥ పరుల న్వేడకయుండ, వేశొకఁడు నన్ప్రార్థించిన న్నానికిం
బరగన్ లేదనకుండ, నామనము నీపాదారవిందైక సం
స్మరణం బేమరకుండ, నీవరము లిమ్మా నాకు శశ్వత్కృప
న్వరదా! శంకర! సుప్రసాద! శివ! సాంబా! భక్త చింతామణీ॥ 104

తా॥ ఓ భక్తచింతామణీ! శంకరా! సుప్రసన్నా! పరుల వేడక యుండునట్లును, వేశొకడు నన్ను కోరినచో లేదను కుండునట్లును, నామనము నీపాదపద్మములనెల్లప్పుడు విడువక స్మరించుచుండునట్లును అనుగ్రహింపుము. నీవు అంబతో గూడి పాయక నాయెదదలో నెల్లప్పుడు కొలువుండుము – శుభములు ప్రసాదింపుము.




మ॥ నమదార్తైక శరణ్య! నీవు వెలయన్మత్తే భ శార్దూల చ
ర్మముల బ్రీతివహింతుగాన నిపుడే మత్తేభ శార్దూల వృ
త్తముల న్నీకుపహార మిచ్చితిని భక్తవ్రాత మేమిచ్చినం
బ్రమదంబొప్పఁ బరిగ్రహింతుగద సాంబా! భక్త చింతామణీ॥ 105

తా॥ ఓ భక్త చింతామణీ! వరదా! శరణు కోరిన వారిని ఆదరించి ఆర్తిని పోగొట్టు వాడవునీవు. మత్తేభ శార్దూల చర్మములన్న నీకు ప్రీతి గావున నేను మత్తేభ శార్దూల వృత్తములను కానుకగా నిచ్చుచున్నాను. భక్తులేమిచ్చినను ప్రమోదముతో పరిగ్రహించుట నీ అనుగ్రహమునకు నిదర్శనము.

మ॥ తనయుల్మాటలు సూటినేరక తమిం దప్పొప్పులెట్లాడినన్
జనకుల్మోదముతోడ జూతురటులే సర్వేశ నీవీజగ
జ్జనకుండౌట మదుక్తి లోపముల నెంచంబోక వాత్సల్యభా
వనిరూఢింగరుణించి కైకొనుము సాంబా! భక్త చింతామణీ॥ 106

తా॥ ఓ భక్తచింతామణీ! కరుణాసాగరా! సాంబశివా! బిడ్డలు వచ్చీరాని మాటలు ఎట్లు పలికినను జననీ జనకులు సంతోషముతో విందురు, ఆదరింతురు. అట్లే సర్వేశ్వరా! నీవు ఈ జగత్తునకు జనకుడవగుటచే నామాటలలోని లోపములెంచక స్వీకరించి వాత్సల్యభావముతో నాదరింపుము.

మ॥ వితతశ్రీకర సత్పదార్థ గరిమన్విఖ్యాతి శోభిల్లు నీ
శతకంబెవ్వరు వ్రాసినం జదివినన్ సద్భక్తి నాలించినన్
సతతాభీష్ట సమస్త భోగపరమైశ్వర్యంబులం బొంది శా
శ్వత కైలాస పదంబుగాంతురొగి సాంబా! భక్త చింతామణీ॥ 107

తా॥ ఓ భక్తచింతామణీ! విశ్వేశ్వరా! శ్రీకరములగు సత్పదార్థములలో విలసిల్లుచున్న ఈ శతకమును ఎవరు వ్రాసినను, చదివినను, భక్తితో వినినను వారి అభీష్టములు నెరవేరును. సమస్తభోగ భాగ్యములు, సకలైశ్వర్యములు సిద్ధించును. తుదకు వారు శాశ్వత కైలాసపదము నలంకరింతురు. అట్లు నీవనుగ్రహింపుము.

మ॥ చెలువౌ నీకృతి గూర్చి నీకొసగితిన్ శ్రీకూచిమంచాఖ్య స
త్కుల సంజాతుడ సోమసుందర వరాఖ్యుండ న్మహా గౌతమీ
విలసత్తీర తలస్థ 'పల్వలపురీ' విఖ్యాత వాసుండ ను
జ్జ్వల లీలం దయ దీని జేకొనవె సాంబా! భక్త చింతామణీ॥ 108






తా॥ ఓ భక్త చింతామణీ! సాంబశివా! నేను శ్రీకూచిమంచి వంశ సంజాతుడనగు సోమసుందర నామధేయుడను. గౌతమీ నదీ తీరమున విలసిల్లుచున్న పల్వల(పలివెల)పురిలో నుండు వాడను. నిన్ను సేవించుచు నీ సన్నిధిలో నుండి సుందరమగు నీకృతిని వ్రాసి నీకంకితమిచ్చితిని చేకొనుము. నన్ననుగ్రహింపుము. నీవు అంబతో గూడి పాయక నాయెడదలో నెల్లప్పుడు కొలువుండుము – శుభములు ప్రసాదింపుము.

స్వస్తి.

**ఏతత్ సర్వం శ్రీపరమేశ్వరార్పణమస్తు**



పలివెల దివ్యక్షేత్రములో వెలసియున్న అర్ధనారీశ్వరమూర్తి

---

*ఆత్మాత్వంగిరిజామతిః సహచరాః ప్రాణాః శరీరంగృహం*
*పూజాతేవిషయోపభోగరచనా నిద్రా సమాధిస్థితిః*
*సంచారః పదయోః ప్రదక్షిణవిధిః స్తోత్రాణి సర్వాగిరః*
*యద్యత్కర్మకరోమి తత్తదఖిలం శంభో! తవారాధనం ॥*

అజన్మానోలోకా కిమవయవవంతోపిజగతాం
అధిష్ఠాతారం కిం భవవిధి రనాదృత్య భవతి,
అనీశో వాకుర్యా ద్భువనజననే కః పరికరో
భవేన్మందాస్త్వాం ప్రత్యమరవర! సంశేరత ఇమే. 6

త్రయీ సాంఖ్యం యోగః పశుపతి మతం వైష్ణవమితి
ప్రభిన్నే ప్రస్థానే పరమిదమదః పథ్యమితిచ,
రుచీనాం వైచి త్ర్యాదృజుకుటిల నానాపథజుషాం
నృణామేకో గమ్యస్త్వమసి పయసా మర్ణవ ఇవ. 7

మహోక్షః ఖట్వాంగం పరశురజినం భస్మఫణినః
కపాలం చేతీయత్తవ వరద! యంత్రోపకరణమ్,
సురాస్తాం తామృద్ధిం దధతి తు భవద్భ్రూప్రణిహితాం
నహి స్వాత్మారామం విషయ మృగతృష్ణాభ్రమయతి. 8

ధ్రువం కశ్చి ద్సర్వం సకలమపర స్త్వధ్రువమిదం
పరోధ్రౌవ్యాధ్రౌవ్యే జగతి గదతివ్యస్తవిషయే,
సమస్తే ప్యేతస్మిన్ పురమథనతైర్విస్మయ ఇవ
స్తువన్ జిహ్రేమి త్వాం నఖలు ననుధృష్టా ముఖరతా. 9

తవైశ్వర్యం యత్నాద్యదుపరి విరించో హరి రథః
పరిచ్ఛేత్తుం యాతావనలమనలస్కంధవపుషః,
తతో భక్తిశ్రద్ధా భరగురుగృణద్భ్యాం గిరిశ! యత్
స్వయంతస్థే తాభ్యాం తవ కిమనువృత్తిర్న ఫలతి. 10

అయత్నా దాపాద్యత్రిభువన మవైరవ్యతికరం
దశాస్యోయద్బాహూనభృత రణకండూపరవశాన్,
శిరః పద్మశ్రేణీ రుచిత చరణాంభోరుహబలేః
స్థిరాయా స్త్వద్భక్తేస్త్రి పురహర! విస్ఫూర్జిత మిదమ్ ॥ 11





## శివమహిమ్నస్తోత్రమ్

*(శ్రీ పుష్పదంత విరచితం)*

మహిమ్నః పారం తే పరమవిదుషో యద్యసదృశీ
స్తుతిర్బ్రహ్మాదీనా మపి తదవసన్నాస్త్వయి గిరః,
అథావాచ్య స్సర్వస్స్వమతిపరిణామావధి గృణన్
మమాప్యేష స్తోత్రే హరనిరపవాదః పరికరః. 1

అతీతః పంథానం తవ చ మహిమా వాఙ్మనసయోః
అతద్వ్యావృత్త్యాయం చకిత మభిధత్తే శ్రుతిరపి,
సకస్యస్తోతవ్యః కతివిధగుణః కస్యవిషయః
పదేత్వర్వాచీనేపతతి నమనః కస్యన వచః. 2

మధుస్ఫీతా వాచః పరమమమృతం నిర్మితమతః
తవబ్రహ్మన్! వాణ్యా అపి సురగురోర్విస్మయపదమ్,
మమ త్వేతాంవాణీం గుణకథనపుణ్యేన భవతః
పునాత్యస్మిన్న ర్థేపురమథనబుద్ధిర్వ్యవసితా. 3

తవైశ్వర్యం యత్త జ్జగదుదయరక్షా ప్రళయకృత్
త్రయీవస్తు వ్యస్తం తిసృషు గుణభిన్నాసు తనుషు,
అభవ్యానామస్మిన్ వరద! రమణీయామరమణీం
విహంతుం వ్యాక్రోశీం విదధత ఇహైకే జడధియః 4

కిమీహః కిం కాయ స్సఖలు కి ముపాయ స్త్రిభువనం
కి మాధారోధాతా సృజతికి ముపాదాన ఇతిచ,
అతర్క్యైశ్వర్యే త్వయ్యనవసరదుస్థో హతధియః
కుతర్కోయం కాంశ్చిన్ముఖర యతి మోహాయ జగతామ్. 5

అముష్యత్వత్సేవాసమధిగతసారం భుజవనం
బలాత్కైలాసేపి త్వదధివసతౌ విక్రమయతః,
అలభ్యా పాతాళేప్యలసచలితాం గుష్ఠ శిరసి
ప్రతిష్ఠా త్వయ్యాసీద్ధ్రువ ముపచితో ముహ్యతి తతః ॥ 12

యదృద్ధిం సుత్రామ్ణో వరద! పరమోచ్చైరపి సతీ
మధిశ్చక్రే బాణః పరిజనవిధేయత్రిభువనః,
నతచ్చిత్రం తస్మిన్వరి వసితరి త్వచ్చరణయోః
నకస్యా ఉన్నత్యైభవతి శిరసస్త్వయ్య వనతిః. 13

అకాండబ్రహ్మాండ క్షయచకిత దేవాసుర కృపా
విధేయస్యా సీద్యస్త్రినయన విషం సంహృతవతః,
సకల్మాషః కంఠే నతవ కురుతేనశ్రియమహో
వికారోపి శ్లాఘ్యో భువనభయ భంగవ్యసనినః. 14

అసిద్ధార్థానైవ క్వచిదపి సదేవాసురనరా
నివర్తంతే నిత్యం జగతి జయినో యస్య విశిఖాః,
సజానిన్నీశ! త్వామితరసుర సాధారణమభూత్
స్మరస్స్మర్తవ్యాత్మా నహి వశిషు పథ్యః పరిభవః. 15

మహీపాదాఘాతాద్వ్రజతి సహసా సంశయపదం
పదం విష్ణోర్భ్రామ్య ద్భుజపరిఘరుగ్ణ గ్రహగణమ్,
ముహు ర్ద్యౌ ర్దౌస్థ్యం యాత్యనిభృతజటాతాడితతటా
జగద్రక్షాయై త్వం నటసి నను వామైవ విభుతా ॥ 16

వియద్వ్యాపీతారాగణగుణిత ఫేనోద్గమరుచిః
ప్రవాహోవారాం యః పృషతలఘుదృష్టశ్శిరసితే,
జగద్ద్వీపాకారం జలధి వలయం తేన కృతమి
త్యనేనైవోన్నేయం ధృతమహిమ దివ్యం తవ వపుః. 17





రథః క్షోణీ యంతా శతధృతిరథేంద్రో ధనురథో
రథాంగే చంద్రార్కౌ రథచరణపాణి శ్శర ఇతి,
దిధక్షోస్తే కోయం త్రిపురతృణమాడంబరవిధిః
విధేయైః క్రీడంత్యో నఖలు పరతంత్రాః ప్రభుధియః. 18

హరిస్తేసాహస్రం కమలబలి మాధాయ పదయోః
యదే కోనే తస్మిన్ నిజ ముదహర న్నేత్రకమలమ్,
గతోభక్త్యుద్రేకః పరిణతి మసౌ చక్రవపుషా
త్రయాణాం రక్షాయై త్రిపురహర! జాగర్తి జగతామ్. 19

క్రతౌ సుప్తే జాగ్రత్త్వమసి ఫలయోగే క్రతుమతాం
క్వ కర్మప్రధ్వస్తం ఫలతి పురుషారాధనమృతే,
అతస్త్వాం సంప్రేక్ష్య క్రతుషు ఫలదానప్రతిభువం
శ్రుతౌ శ్రద్ధాం బధ్వా దృఢపరికరం కర్మసు జనః. 20

క్రియాదక్షోదక్షః క్రతుపతి రధీశ స్తనుభృతాం
ఋషీణా మార్త్విజ్యం శరణద! సదస్యా స్సురగణాః,
క్రతుభ్రేష్ట స్త్వత్తః క్రతుషు ఫలదానవ్యసనినో
ధ్రువం కర్తుః శ్రద్ధావిధురమభి చారాయ హి మఖాః. 21

సతాం వర్త్మత్యక్త్వా శ్రుతి సమధిగమ్యం సహభువం
ఘృణామప్యున్మూల్య స్వజనవిషయస్నేహగుణితామ్,
ద్విజః కృంతన్పాదే పితర మపరాద్ధం త్వయి విభో!
మనుష్యత్వం సద్యస్త్రి దశపరిణామేన విజహౌ. 22

ప్రజానాథం నాథ ప్రసభమధికం స్వాం దుహితరం
గతాం దేహోద్భూతాం రమయితుమద్రుశ్యస్య వపుషా,
ధనుష్పాణేర్యాతం దివమపి సపత్రాకృతమముం
పరిత్రస్తం తం తే త్యజతి నమృగవ్యాధరభసః. 23



స్వలావణ్యాశంసా ధృతధనుషమహ్నాయతృణవత్
పురఃప్లుష్టం దృష్ట్వా పురమథన పుష్పాయుధమపి,
యదిస్త్రైణం దేవీ యమ నిరత దేహార్ధ ఘటనాత్
అవైతిత్వామద్ధా వరద! ముగ్ధాయువతయః. 24

శ్మశానేష్వాక్రీడాస్మరహర! పిశాచాస్సహచ రాః
చితాభస్మాలేపః స్రగపి నృకరోటీపరికరః,
అమంగళ్యం శీలం తవ భవతు నామైవమఖిలం
తథాపి స్మర్తౄణాం వరద! పరమంమంగళమసి. 25

మనః ప్రత్యక్చిత్తే సవిధమవధాయాత్తమరుతః
ప్రహృష్య ద్రోమాణః ప్రమదసలిలోత్సంగితదృశః,
యదాలోక్యాహ్లాదం హ్రదఇవ నిమజ్యామృతమయే
దధత్యంత స్తత్త్వంకిమపి యమిన స్తత్కిలభవాన్. 26

త్వమర్కస్త్వం సోమస్త్వమసి పవనస్త్వం హుతవహః
త్వమాప స్త్వం వ్యోమత్వము ధరణిరాత్మాత్వమితి చ,
పరిచ్ఛిన్నా మేవం త్వయి పరిణతా బిభ్రతి గిరం
నవిద్మస్త తత్త్వం వయమిహతు యత్త్వం న భవసి. 27

త్రయీం తిస్రోవృత్తీ స్త్రిభువన మథో త్రీనపి సురాన్
అకారాద్యై ర్వర్ణైస్త్రిభి రభిదధ త్తీర్ణవికృతి,
తురీయంతే ధామధ్వనిభిరవరుంధానమణుభిః
సమస్తం వ్యస్తం త్వాం శరణద! గృణాత్యోమితిపదమ్. 28

భవ శ్శర్వో రుద్రః పశుపతి రథోగ్రస్సహ మహాన్
తథాభీమేశానా వితి యదభిధానాష్టక మిదమ్,
అముష్మిన్ప్రత్యేకం ప్రవిచరతి దేవశ్రుతిరపి
ప్రియాయాస్మై ధామ్నే ప్రణిహిత నమస్యోస్మిభవతే. 29





నమో నేదిష్ఠాయప్రియదవదవిష్ఠాయచ నమో
నమః క్షోదిష్ఠాయ స్మరహర! మహిష్ఠాయచ నమః,
నమో వర్షిష్ఠాయ త్రినయన! యవిష్ఠాయ చ నమో
నమస్సర్వస్మై తే తదిదమతిశర్వాయ చ నమః. 30

బహుళరజసే విశ్వోత్పత్తౌ భవాయ నమోనమః
జనసుఖకృతే సత్త్వోద్రేకే మృడాయ నమోనమః,
ప్రబలతమసే తత్సంహారే హరాయ నమోనమః
ప్రహతవిపదేనిస్త్రై గుణ్యే శివాయ నమోనమః. 31

కృశపరిణతిచేతః క్లేశవశ్యం క్వచేదం
క్వచ తవగుణ సీమోల్లంఘినీ శశ్వదృద్ధిః,
ఇతి చకిత మమందీకృత్య మాం భక్తిరాధాత్
వరద! చరణయోస్తే వాక్యపుష్పోపహారమ్. 32

అసితగిరిసమం స్యాత్కజ్జలం సింధుపాత్రే
సురతరువరశాఖా లేఖినీ పత్రముర్వీ,
లిఖతి యది గృహీత్వా శారదాసార్వకాలం
తదపి తవగుణానా మీశ! పారం నయాతి. 33

వపుః ప్రాదుర్భావాదనుమితమిదం జన్మని పురా
పురారే! న క్వాపి క్షణమపి భవంతం ప్రణతవాన్,
నమన్ముక్తస్సం ప్రత్యహమతను రగ్రేప్యనతి మాన్
ఇతీశ! క్షంతవ్యం తదిదమప రాధద్వయమపి. 34

అసురసురమునీంద్రై రర్చితస్యేందుమౌళేః
గ్రథితగుణమహిమ్నో నిర్గుణ స్యేశ్వరస్య,
సకలగుణవరిష్ఠః పుష్పదంతాభిధానో
రుచిరమలఘు వృత్తైస్తోత్ర మేతచ్చకార. 35

అహరహరనవద్యం ధూర్జటేస్స్తోత్ర మేతత్
పఠతిపరమ భక్త్యాశుద్ధ చిత్తః పుమాన్యః,
సభవతి శివలోకే రుద్రతుల్య స్తథాత్ర
ప్రచురతరధనాయుః పుత్రవాన్ కీర్తిమాంశ్చ 36

దీక్షాదానంతపస్తీర్థం। యోగహోమాదికాః క్రియాః
మహిమ్నస్తవపాఠస్య। కలాంనార్హంతిషోడశీం। 37

మహేశా న్నాపరో దేవః మహిమ్నో నాపరస్స్తవః,
అఘోరాన్నాపరోమంత్రః నాస్తితత్త్వం గురోః పరమ్. 38

అసమాప్తమిదం స్తోత్రం పూజ్యగంధర్వభాషితమ్,
అసమానం మనోహారి శివ మీశ్వరవర్ణనమ్. 39

కుసుమదశననామా సర్వగంధర్వరాజః
శశిధరవరమౌళే ర్దేవ దేవస్య దాసః,
సగురునిజమహిమ్నో భ్రష్ట ఏవాస్యరోషాత్
స్తవన మిద మకార్షీ ద్దివ్యదివ్యం మహిమ్నః. 40

సురవరమునిపూజ్యం స్వర్గమోక్షైక హేతుం
పఠతి యది మనుష్యః ప్రాంజలిర్నాన్యచేతాః,
వ్రజతి శివసమీపం కిన్నరై స్స్తూయమానః
స్తవన మిదమమోఘం పుష్పదంత ప్రణీతమ్. 41

శ్రీపుష్పదంతముఖపంకజనిర్మితేన
స్తోత్రేణ కిల్బిషహరేణ హరప్రియేణ,
కంఠస్థితేన లిఖితేన గృహస్థితేన।
సుప్రీణితో భవతి భూతపతిర్మహేశః. 42

యత్కృత్యం తన్నకృత్యం యదకృత్యం కృత్యవత్తదా చరితం
ఉభయోః ప్రాయశ్చిత్తం శివతవ నామాక్షరద్వయో చ్చరితమ్. 43





సంసారసర్పదష్టానాం జంతూనా మవివేకినామ్,
చంద్రశేఖర పాదాబ్జస్మరణం పరమౌషధమ్. 44

ఏకకాలం త్రికాలం వాసర్వదా యః పఠేన్నరః,
సర్వపాపవినిర్ముక్త శ్శివలోకే మహీయతే. 45

ఇతి శ్రీ పుష్పదంతాచార్య విరచితం శివమహిమ్నః స్తోత్రం



**అలఘు మహిమాన్విత స్తోత్రానికి లఘు పరిచయం**



పుష్పదంతుడను గంధర్వరాజు పరమశివభక్తుడై నిత్యం ఇంద్రోద్యానంలోని కల్పవృక్ష కుసుమాలతో పరమేశ్వరుని పూజించేవాడు. ఉద్యానవనం పుష్పరహితమై శచీపతికి ఆగ్రహం కలిగించింది. పూలదొంగను పట్టుకొనే ఆలోచనతో ఇంద్రుడు శివనిర్మాల్యం వనమంతా చల్లించే ఉపాయం చేశాడు. పూలకై వచ్చిన పుష్పదంతుడు శివనిర్మాల్యం త్రొక్కడంవల్ల శక్తి విహీనుడై నందున పరిపరి విధాల శివుని స్తుతించాడు. ఆ మహా శివభక్తుడు ఈ స్తోత్రం ద్వారా శివుని ప్రార్థించి శివానుగ్రహం పొందాడు.

ఈ స్తోత్రం ఇహపర సాధకమైనదిగా అనన్య సామాన్య ప్రచారం పొందినది. భక్తులచే నిత్యం పారాయణ చేయబడుతున్న ఈస్తోత్రం విశిష్టమైనది. దీనిని పఠించి శివానుగ్రహం పొంది తరింతురుగాక!